# కరుణశ్రీ

## బుద్ధభగవానుని
## పవిత్రచరిత్రము

జంధ్యాల పాపయ్యశాస్త్రి
"కరుణశ్రీ"

సత్యనారాయణ పబ్లిషింగ్ కంపెనీ
రాజమహేంద్రవరము

# ఉపశ్రుతి

ఉదయశ్రీ — విజయశ్రీ — కరుణామయి ఇత్యాది కావ్యాలు రచించిన కవిమిత్రులు శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు నవ్యాంధ్ర కవితాజగత్తులో సారస్వతోపాసకులకు చిరపరిచితులు.

"కరుణశ్రీ" వీరి క్రొంగ్రొత్త కావ్యం. కథావస్తువు బుద్ధభగవానుని జీవిత వృత్తం. ఉన్నత హిమాలయపర్వత పరంపరల మధ్య రోహిణీనదీ తీరాన కపిలవస్తు మహానగరంలో మాయాదేవీ శుద్ధోదనులకు పుత్రుడై ఉద్భవించి జగద్గురువై అహింసాప్రబోధం సల్పిన అమృతమూర్తి అమరగాథ.

ఇతివృత్తం విశ్వవిఖ్యాతం. ఒకనాడు ఆసేతు హిమాలయం బుద్ధభగవానుని దివ్యప్రబోధం వ్యాపించింది. అంతఃపుర ప్రాసాదవాటికలలో పర్వత గుహాభ్యంతరాలలో చక్రవర్తులు శిల్పులు ఆ దివ్యమూర్తిని ప్రతిష్ఠించి ఆరాధించారు. అజంతా కుడ్యాలపై, ఎల్లోరా పర్వతసానువులలో, సింహళ, యవ, మధుర, చీనా, జపాను ఇత్యాది ద్వీప ద్వీపకల్పాలలో ఎందరో అజ్ఞాతశిల్పులు పాషాణాలకు లోహాలకు బుద్ధుని ఆకారరేఖలు తీర్చిదిద్దారు. ప్రపంచ వాఙ్మయంలో బుద్ధుని జీవితచరిత్రం చిత్రించిన మహాకవు లెందరో ఉన్నారు.

కాని — అది ప్రాచీనచరిత్ర.

అర్వాచీన చరిత్రలో అహింసాసిద్ధాంతం క్రొంగ్రొత్త వెలుగుదారులు చేసికొని తిరిగి అవతరించింది. గాంధీయుగంలో అహింస చైతన్యరూపం దాల్చింది. స్వాతంత్ర్య విహాయసంలో నవ్యభారత జాతీయపతాకంపై బుద్ధభగవానుని ధర్మచక్రం సాక్షాత్కరించింది. విశ్వమానవకళ్యాణవేదిపై నిలిచి నూత్న భారత దేశానికి అహింసా సిద్ధాంతం అందించిన యుగపురుషుడు గాంధీమహాత్ముడు. సంఘానికీ సారస్వతానికీ బింబ ప్రతిబింబ భావం నిసర్గం. ఈ సూత్రం సమష్టి

గానేగాక వ్యష్టిగా గూడ సత్యం. కావ్యంలో ప్రతిఫలించేది కవి భౌతికరూపం కాదు; అది అతని అంతరాత్మ. మహాకవి యుగపురుషుడు. నూత్న యుగ ధర్మప్రవక్త. ఏ మహాకావ్యం యుగధర్మం ప్రబోధిస్తుందో ఆ మహాకావ్యం, ఆ కవిత, ఆ యుగానికి ప్రాతినిధ్యం వహింపగలవు. "విశ్వశ్రేయః కావ్యమ్" అన్న ఆర్షవాక్యమునకు అంతరార్థ మిదే. కరుణామయుడై అహింసాజ్యోతిని వెలిగించి మానవలోకంలో వెలుగు వెల్లువలు విరియించిన బుద్ధుని జీవితగాథను ఇతివృత్తంగా తీసికొని చిత్రించిన శ్రీ పాపయ్యశాస్త్రిగారు అధునాతన భారత ప్రజాకోటి – కాదు – విశ్వ ప్రజాకోటి – ఆశయానుభూతులను కవితారూపంలో ఛందోగానం చేశారు. ఈ అర్థంలో ఈ మహాకవి నూత్నయుగ ప్రవక్త. కరుణశ్రీ – నవ్యకవితకు ప్రాతినిధ్యం వహిస్తుంది. శ్రీ తిరుపతి వెంకటకవుల "బుద్ధచరిత్ర" శ్రీ పింగళి లక్ష్మీకాంతం కాటూరి వెంకటేశ్వరకవుల "సౌందర నందం" ఇట్టి ఉన్నత శ్రేణికి చెందిన ఉజ్వల కావ్యాలు. ఇతివృత్త గౌరవంచే నూత్నయుగ ప్రాతినిధ్య మహిమచే "కరుణశ్రీ" విశ్వజనీనమైన కావ్యం. ప్రథమపర్వం మాత్రం తొలి పొద్దుపొడుపు గాంచినది. సాంగోపాంగంగా సంపూర్ణమైనప్పుడు నేటి మానవకోటి ఆశయాలకు ఆకాంక్షలకు అనుభవాలకు ఆదర్శాలకు రూపకల్పన చేసిన అధునాతన మహేతిహాసం కాగలదు.

"ఉదయశ్రీ"లో "ఉత్తిష్ఠ" అనే శీర్షిక క్రింద 'కటిక కసాయి కెంపు చురకత్తి' గనుంగొని ఏడ్చు గొఱ్ఱెపిల్లను సందిట గదియింపమను ప్రబోధం కన్పిస్తోంది.

"నిదురన్ భంగము చేసినా ననుచు గానీ కూర్మి దేవేరి వ
య్యెద బాంధవ్యము బాపుచుంటి నని కానీ కిన్కఁ గైకోకు"—

"ప్రేయసి ప్రేమలోన గనిపించెడి తీయని స్వర్గ మొక్కఁటే
ధ్యేయముగాదు - హీను లతిదీనులు మ్లానతనుల్ దరిద్రనా
రాయణు లేడ్చుచుండిరి తదశ్రువులన్ తుడువంగ బొమ్ము నీ
ప్రేయసితోడ నీ కట లభించును కోట్లకొలంది స్వర్గముల్"

అను పద్యపంక్తులు భావుకునకు భవితవ్యతా సూచకాలు. "ఉదయశ్రీ"లోని ఆ పంక్తులే ఈ కావ్యానికి తొలి "ఉషస్సులు" కల్పిస్తున్నాయి.

"ఈ మహీ స్వర్గఖండ మొనరింపుము ఘోరహాలాహలమ్ము ది
వ్యామృత మాచరింపుము "జయోస్తు" కుమార ! శిరస్సుపై అహిం
సా మకుట ద్యుతుల్ దశదిశల్ వెలిగింప ప్రపంచ మెల్ల నీ
ప్రేమరసైకవృష్టి గురిపింపుమురా ! కరుణాకళాధరా !"

అని ఆరంభించిన ఊష్మలత కవితోద్వేగం "ఉత్తిష్ఠ" తో అంతరించి పోతుందా? "కరుణశ్రీ" లో బుద్ధభగవానుని ఉజ్వల జీవిత వృత్తంగా పరిణమించటం కేవలం యాదృచ్ఛికం గాదు. ఉన్నత పర్వతశిఖరం పైనుండి ఉద్వేగంతో ఉరుకుతూ వున్న మహానది పరమలక్ష్యం సముద్రాన్ని ఆవిష్కరించుకోట మనేది ఎవరికి తెలియదు ! ఈ అవశ్యశుభ పరిణామ వికాసం "ఉదయశ్రీ" చదివిన భావుకునకు అవగతపూర్వం.

"దేశభాషలందు తెలుగులెస్స"— సాహిత్యసమ్రాట్టు పలుకులు తెనుగునాట ఈ నాటికీ ప్రతిధ్వనిస్తున్నాయి. నన్నయనాటినుండి తెలుగుకవులు అక్షర రమ్యతను ఆరాధిస్తున్నారు. సంస్కృత సాహిత్య ప్రపంచంలోనున్న మృదుమధుర పదప్రయోగవిన్యాసానికి తెలుగుకవులు సిద్ధహస్తులు. నన్నయాది పూర్వకవులు అర్వాచీనకవులకు ఒరవడిని తీర్చిదిద్దారు. దాక్షిణాత్యకవులు తెలుగు పలుకు బడులకు నానుడులకు పేరుమ్రోగారు. నన్నయనుండి నేటివరకు అవిచ్ఛిన్నంగా సాగివస్తూ వున్న కవితాస్రవంతిలో ఎప్పటికప్పుడు ఆద్యంతాల నందుకొని ఏకధారగా ప్రవహిస్తూ వున్న ఐక్యభావం అనిర్వచనీయమైన "తెనుగుదనం." ఇది కవితకు అంతరాత్మ. సమస్తాంధ్రకవిప్రయోగ విశేషములలో "సమానాప వర్త్యము"లైన ధర్మాలతో ఈ తెనుగుదనం శ్రీ పాపయ్యశాస్త్రిగారి కవితలో శోభిస్తున్నది. అధునాతన కావ్యజగత్తులో కొన్ని కావ్యాలకు ఈ లక్షణం వర్తించటం లేదు. అంతమాత్రంచేత అవి హేయాలు కావు. అది విషయాంతరం. ఆంధ్రవాఙ్మయంలోని ఉత్తమకవితా సంప్రదాయాలను ఆత్మీయం చేసికొని నవ్యఫణితిని నూత్నకావ్యాన్ని సృష్టించిన ఈ మహాకవి అభినందనీయుడు. "నన్నయ" వృత్తరచనలోని గంభీరగమనం సంస్కృతసమాసాలలోని సారళ్య మాధుర్యాలు, "తిక్కన" సజీవ పదప్రయోగంలోని గరువతనం "శ్రీనాథు"ని

సీసాలలోని ఉయ్యాల తూగు "పోతన" పద్యాలలోని మందార మకరంద - మాధుర్యం, దాక్షిణాత్యకవుల కమ్మని తెలుగు పలుకుబడులు రాశీభూతమై శ్రీ పాపయ్యశాస్త్రిగారి కవితలో ఎడనెడ సాక్షాత్కరిస్తాయి.

కమ్మని తెలుగు నుడికారపు సొంపులు వంపులు పాపయ్యశాస్త్రిగారి కృతులలో తామరతంపరలు. "అనసూయ"ను గూర్చి

"అమ్మ ! నీ చేతి తాలింపు కమ్మదనము
భరత దేశాన గుమగుమ పరిమళించె"

"గోరుముద్దలు గుజ్జనగూళ్ళు తినుచు" దివ్యమూర్తిత్రయం ఆమెయింట దోగాడినారు. ఆమె పాతివ్రత్యమాహాత్మ్యంలో ఉక్కుశనగలు "తుకతుక" ఉడికిపోయినవి.

"ఏకో రసః కరుణ ఏవ"— అని ప్రతిపాదించాడు భవభూతి. ఆ మహాకవి కావ్యాలన్నీ ఒక యెత్తు; ఈ ఒక్క వాక్యం ఒక యెత్తు. రసాత్మకమైన ఈ ఒక్క వాక్యమే ఒక మహాకావ్యం. శ్రీ పాపయ్యశాస్త్రిగారికి కరుణరసం ఆత్మ సర్వస్వం, "పుత్తడి తమ్మిమొగ్గ జిగిబుగ్గల ముద్దుల మూటకట్టు నెత్తురుకందు నెత్తుకొని" "జంకొదవెడి కాళ్ళతోడ" మేడమెట్లు దిగుచున్న "కుంతీకుమారి" ఒకనాడు ఈ కవికి సాక్షాత్కరించింది. అయోధ్యాంతఃపుర సౌధ మాలికాభ్యంతరాలలో అన్నగారిని అనుసరించి వెడలిపోయిన లక్ష్మణుని దేవి ఊర్మిళాకుమారిని జూచి—

"పైట చెరంగుతో పుడమిపై బడకుండగ అద్దుకొమ్ము నీ
కాటుక కన్నుదామరల కాలువలై ప్రవహించు వేడి క
న్నీటి కణాలు; క్రిందపడనీయకు ముత్తమ సాధ్వివైన నీ
బోటి వధూటి బాష్పములు భూమి భరింపగలేదు సోదరీ !"

అని ఓదార్చినాడు.

నేటికి బుద్ధభగవానుడు విశ్వరూపంతో సాక్షాత్కరించాడు. "సుఖస్వప్నము, శుభోదయము, నిశ్వాసము, సమున్మేషము, సానుభూతి, అనుకంప, ఇది ఆశ్వాస నామాల ఆనుపూర్వి.

"ఏ సదయమూర్తి హృదయ వాహినుల చలువ
మంటిలోనుండి బంగారుపంట లెత్తు;
ఆ మహీధరమండలస్వామి యలరు
నలఘు మహిమాలయమ్ము హిమాలయమ్ము"—

హిమాలయ పర్వతవర్ణనతో కాళిదాసమహాకవి వాక్యచ్ఛాయలతో—

"ఈ హిమశైలరాజమున కించుక దక్షిణమందు రోహిణీ
వాహిని యొడ్డునన్ కపిలవస్తుపురమ్ము సమస్తవస్తు సందోహకమై విరాజిలు"

కమ్మగా కథ ఆరంభించింది.

మాయాదేవిని దేవదహమునకు పంపించే ప్రకరణంలో—

"....శాక్యభూపాలమౌళి
కరుణకవి కావ్య మట్లనుద్ఘాత లలిత
మృదుల శయ్యాకమగు తేరు పదిలపరచె"—

ఇట్లు సర్వజనవేద్యంగా సుకుమారభావాన్ని స్వయంవ్యక్తంచేసే మృదుశయ్య ఈ కవిది.

"ఒడుదుడుకు లేని పథమువెంబడి రథమ్ము
నడచుచుండెను సుకవి ఛందమ్ముమాడ్కి"

రథం బాగానడిచింది. మరీ బాగానడిచింది— మెత్తగా నడిచింది— ఎంత చెప్పినా అవ్యక్తం — అనిర్వచనీయమైన భావం వచనీయమయింది ఈ ఉపమానంవల్ల.

కట్టెలు కొట్టుచున్న నిరుపేదను చూచిన అక్కటికంచే మాయాదేవి—

"ఆర్ద్రనయనాల ఆణిముత్యాలమాల
స్నిగ్ధహృదయానుభూతి" నందించినది.

"సహజ సముదాత్త భావనా శక్తినుండి
అమృతమయ కావ్య ముత్పన్నమైనయట్లు
పరమకళ్యాణి రాణి గర్భమ్మునుండి
విశ్వమోహనమూర్తి ఆవిర్భవించె"—

ఉజ్వలంగా, ఉదాత్తంగా బుద్ధభగవానుని ఉద్భవం ఉపపాదించినాడు కవి. ఈ ఉత్తమోపమానం సమ్యక్పతితం.

అప్పుడు లుంబినీవనంలో ఉద్భవించిన బుద్ధుని—

"మిసమిసలాడుచున్న సుతిమెత్తని బుగ్గలు చూచి ఏమిటో
గుసగుసలాడు కొన్నయవి గువ్వల జంటలు కొమ్మచాటునన్"—

రవి గాంచనిచో కవి గాంచును. కవి విప్పారిన దివ్యచక్షువుతో అతిలోకమైన సౌందర్యాన్ని దర్శించి ప్రదర్శింపగలడు. అట్టి క్రాంతదర్శనంగల మహాకవి కుటుంబంలో శ్రీ పాపయ్యశాస్త్రిగా రాకరు.

"....కుమారుని గన్నవార్త ఉ
త్ఫుల్ల సరోజసౌరభము పోలిక వెన్నెలవాక కైవడిన్
పిల్లనగ్రోవి పాటవలె ప్రేమసుధారస మాధురీక్రియన్
పల్లెల పట్టణావళుల బ్రాకె క్షణక్షణ వర్ధమానమై"—

కుమారునిగన్న అద్యతన భావిలో మాయాదేవి జీవితాశ్వాసము పూర్తియైనది.

"చిక్కనిముంగురుల్ మిసిమి చెక్కులు ప్రేమసుధాప్లుతమ్ములౌ
దృక్కులు చూచినన్ తనివితీరద యెంతకు - నింతకాలమో
చక్కనితండ్రి యే తెరలచాటున ఏ తెలిమబ్బుమాటునన్
నక్కితివోయి మాయ నయనమ్ములకున్ గనరానిదొంగవై"

అని, ఆ మోహనమూర్తిని చూచిన కనుంగవ—

"ఎట్లు చెందియు కనుంగొను నీ వికటప్రపంచముల్"

అని మాయాదేవి కన్నుమూసినది, "మూసిన కన్నుదోయి" మూసినయట్లనె యున్నది. "మోవి గైసేసిన హాసరేఖ" అట్లనె యుండె. ఆమెకు హృదయ చాలనము లేదు.

"కలకలలాడు మేడలమొగమ్ములు నీడల కాలవాలమై
వెలవెలబోయె, శాక్యపురవీధుల ఖేదపయోదమాలికల్
వలగొనె — నాటి రే కపిలవస్తుపురమ్ము శ్మశాన వాటిలో
వెలుతురు గాంచి గుండెలు ద్రవించెను కొండల చక్రవర్తికిన్"

కరుణము పరాకాష్ఠ చెందింది. కొండలచక్రవర్తి గుండెలుద్రవించాయి. అతనివి రాతిగుండెలు కావు; మంచుగుండెలు. ఈవిధంగా స్వారస్యపు తీగెలు సాగిస్తూ, ఇందులో అలంకారమైన గుణీభూత వ్యంగ్యం ఉన్నది. "ధ్వని తరంగితమై ప్రతిధ్వనిస్తోంది." అని అనుభూతిని ప్రస్తరించి ప్రదర్శించటం రసానురంజకం కావచ్చు. భంజకముగూడ కావచ్చును. లలితకళలు, విశేషించి కవిత అనుభవైకవేద్యాలు. అతిశయ శేముషీ ధురంధరులైన శాస్త్రజ్ఞులు ఆటమ్‌బాంబును కల్పింపవచ్చును; సరిక్రొత్త విమానములను నిర్మింపవచ్చును; కాని ఒక గులాబిపువ్వునుగాని — ఒక మల్లెమొగ్గనుగాని సృష్టింపలేరు. అది ప్రయోగ శాలలకు అలభ్యం. ఆలంకారిక శాస్త్రానుసారం కవితను ప్రచ్ఛేదించటం అసాధ్యం. అసలు కవి అనిర్వచనీయమైన సౌందర్యమును అతిలోకమైన అనుభూతిని వాగ్రూపములో ప్రతిపాదిస్తాడు. వాచామగోచరమైన కవితానుభూతిని భౌతిక చక్షువులకు అందని సౌందర్యం వాక్కులో ఉపపాదించటమే స్వవచోవ్యాఘాతమైన ప్రతిపాదన కావచ్చునుగాని, కవితాప్రపంచంలో స్వయం వ్యక్తమైన విచిత్రవిరోధాభాసం. అందుచే సౌందర్యమీమాంసను అనుశీలించి ఆలంకారికులు అనుభూతిని ప్రస్తరింపగల్గుతున్నారు.

తొలిఉషస్సులలో తుషారబిందుతుందిలమై మందహాసాలు చిందుతూ వికసించిన ఒక గులాబీపువ్వును చూచినప్పుడు "ఎంతలలితంగా ఉన్నది" అని భావుకుని మనస్సు అమాంతంగా ఆ పువ్వుమీద వ్రాలుతుంది. ఒక పర్వతసానువునుండి

జలజల స్రవిస్తూ గులకరాళ్ళను దొర్లించుకొంటూ ప్రవహించే సెలయేటిని చూస్తే 'ఎంత మనోజ్ఞంగా ఉన్నది' అని అనవలసివస్తుంది. ఫలపత్ర పల్లవ సంశోభితమై పక్షుల కలకల నినాదాలతోఉన్న ఉద్యానవనం చూచినప్పుడు 'ఎంత మనోజ్ఞంగా ఉన్నది!' అనిపిస్తుంది. ఆకాశాన్ని అంటుకొంటూఉన్న ఉన్నత హిమాలయశృంగాలను, మంచుకొండలు విరిగి కరిగి సెలయేరులై ప్రవహించటం చూస్తే 'అమ్మో!! అని ఆశ్చర్యచకితుడౌతాడు రసజ్ఞుడు. ఈ చకితత్వం — ఈ విభ్రమవిలోలత్వం అధిగమిస్తేనేగాని రసాస్వాదనజరుగదు.

ఇక — ఆద్యంతరహితమై, నిర్వికల్పమైన కాలమహాస్రవంతిని ఊహించుకొన్నపుడు, విశాలవిశ్వంలో రేణువువంటి ఈ భూమిమీద నిలిచి అపారాకాశంలో నున్న తారామండలాలను తిలకిస్తే — ఈ అనుభూతిని ఏమనాలి! భావుకుని హృదయం విద్యుద్ఘాతంవిభ్రమవిలోలత్వంలో విలీనమై రెక్కలు తొడుక్కొని ఎక్కడికో ఎక్కడికో పోతుంది. దీనిని "సద్యఃపరనిర్వృతి" అన్నారు ఆలంకారికులు. దర్శనంలో సౌందర్యానికి వైచిత్రి తోడ్పడి అద్భుతత్వాన్ని కల్పించినట్లే అద్భుతత్వానికి మహత్వం తోడుపడి ఉదాత్తత కల్పించింది. కాని ఉదాత్తతను ఆస్వాదించేటప్పుడు పరిత అనుభూతికి అవరోధాంతరాయాలు లేకుండా పువ్వుమీద వ్రాలిన తుమ్మెదకువలె రసానుభవంలో సద్యఃస్ఫురణఉండదు. ఒక మహావిద్యుద్ఘాతం సద్యఃపరనిర్వృతిని గల్గించి ఇహలోకబంధవిమోచనం గలిగించి వివృతమైన మోక్షద్వారంనుండి రససాక్షాత్కారం గల్గిస్తుంది. "రసోవైసః" అన్న వేదవాక్యార్థమునకు ఈవిధంగా సారస్వత వ్యాఖ్యానం చేసికోవచ్చు. సౌందర్యం ధరించే విరాట్‌స్వరూపం ఉదాత్తత. కాని చాలమంది కవులు "లలితం"గా వ్రాస్తారు. మరి కొందరు మనోజ్ఞతను సాధిస్తారు. ఎవ్వరో అద్భుతతత్వాన్ని ఆవిష్కరించుకొంటారు. కాని విశ్వసాహిత్య ప్రపంచంలో ఉదాత్తతను ఉపాసించి సిద్ధహస్తులైనవారు వ్రేలిమీద లెక్కపెట్టదగినవారు. అందులో శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగా రొకరు.

"రాగమయమైన ప్రకృతి సామ్రాజ్యమందు
ప్రతి పదంబును రస వైభవమ్ము విలుచు

రసమయంబైన సుకవి సామ్రాజ్యమందు
ప్రతిపదంబున రాగ సంపదలు నిలుచు"—

ఇది "అనుకంప" లోని పద్యం. చదివిన పద్యాన్ని తిరిగి చదివేలోగా తగిలే విద్యుద్ఘాతం పఠితను మరో ప్రపంచంలోకి తీసికొనిపోయి భావితాంతఃకరణ ప్రవృత్తిని కల్పిస్తుంది.

దుమ్ములో ఆటలాడుకొంటూవున్న బిడ్డ సిద్ధార్థుని పాదాలను పైటచెరంగుతో అమ్మ ప్రజావతి తుడిచింది — కాని "ఆత్మ తనయాంఘ్రి సరోజ రజో మహా ప్రభావమ్మురవంత" ఎరుగదు. ఉపనయన మహోత్సమున—

"భిక్షాందేహి" యటంచు పుత్రుడు సమీపించన్ ప్రమోదాశ్రువుల్
వక్షోజమ్ముల బార తల్లి కరుణా వాత్సల్య సంపూర్ణయై
భిక్షం బెట్టె — నెరుంగ దీతడు "జగత్ ప్రేమైక దీక్షా మహా
భిక్షూత్తంస" మటంచు — భావిగతి భావింపంగరా దేరికిన్"

ఈ అర్థాంతరన్యాసం కవికికూడా అన్వయిస్తుందా? ఉదాత్తతను ఆవిష్కరించు కానే మహాకవికి త్రికాలాబాధితమైన దివ్యచక్షుస్సు ఉన్నదికదా!

"నీలాభ్రమాలలోనికి జొచ్చికొనిపోవు నగచక్రవర్తి యౌన్నత్యమునకు
కడుపులో బడబాగ్ని నిడి కాలుకదపని ప్రేమాంబురాశి గాంభీర్యమునకు
కరగి నీరై లోకకంఠమ్ము పూరించు ధారాధరేంద్రు సౌందర్యమునకు
అంధసృష్టికి దృష్టినందించి మేల్కొల్పు లోకబాంధవు దయాళుత్వమునకు
చలువదోసిళ్ళ పాలవెన్నెలలు చిలికి
యోషధుల పెంచు శశి నిశాశ్లేషమునకు
హృదయమున నేవియో యూహ లుదయమంద
ముందడుగువేయు "శ్రీఘనానందమూర్తి"

"సానుభూతి" లోని పై పద్యాన్ని పఠించిన భావుకుడు విద్యుద్ఘాతపరంపరలతో ఉదాత్తతను ఆవిష్కరించుకోగలడు.

"అనుకంప"లో రాజహంసను దేవదత్తకుమారుడు బాణముతో పడగొట్టినాడు. క్రింద పడిన రాజమరాళమును గ్రుచ్చియెత్తి "లోకోత్తరమూర్తి" దాని బాధ నపనయించినాడు. దేవదత్త సిద్ధార్థుల వివాదం కరుణరసపరిప్లుతమై అతి సుకుమారంగా నడిచినది. చివరకు న్యాయాధికారి—

"ధరణి సమస్తభంగుల ప్రధానము ప్రాణము ప్రాణికోటి, కే
కరణి లభించునయ్య ! అధికారము ప్రాణులపైన ప్రాణసం
హరణ మొనర్చునట్టి కఠినాత్ములకున్ ? క్షతిగన్న పక్షికిన్
శరణ మొసంగి రక్షణము సల్పిన క్షాత్రవతంసులుండగన్"

అని తీర్పుచెప్పాడు. సిద్ధార్థుని విజయం సకల ప్రాణికోటికి దిగ్విజయమైంది.

ఇట్టి ఐతిహాసిక సౌలభ్యం ఈ కవి కవిత్వానికి "ఝటితిస్ఫూర్తి" గల్గించి ఈ మహేతిహాసరచనకు ఉత్తమోత్తమాధికారాన్ని ప్రసాదిస్తోంది. ఆపాతమధుర మైన సుకుమార పదప్రయోగవిన్యాసం శ్రీ పాపయ్య శాస్త్రిగారికి నేటి కవులలో అగ్రతాంబూలం పూర్వకవులకంటె విశిష్టత సంపాదించి ఇస్తుంది. సంస్కృతంలో "దండినః పదలాలిత్యం" అని దండిమహాకవికి ఆ మర్యాద దక్కినది. శ్రీ పాపయ్య శాస్త్రిగారు "తెలుగుదండి".

ఉదయశ్రీ — విజయశ్రీ — రచించిననాడు కవి పేరు "కరుణశ్రీ". ఆ నాడు అది శ్రీ పాపయ్యశాస్త్రిగారి అన్వర్థ పౌరుష నామధేయం, ఈ నాడు రచించిన కావ్యమే "కరుణశ్రీ". ఈ విధంగా కవికీ కావ్యానికీ అద్వైతానుభావం అభేదాధ్యవసాయంగా పరిణమించింది. "కరుణశ్రీ" కవి అంతరాత్మయొక్క "విశ్వరూప ప్రదర్శనం." కరుణశ్రీకి — ఉపోద్ఘాతపూర్వకంగా ఈ వాక్యాలు వ్రాయటానికి కారణం కవిమిత్రులు శ్రీ పాపయ్యశాస్త్రిగారి సుహృదనుశాసనం. ఈ కవితా గానానికి ప్రావేశికీధ్రువగా ఈ "ఉపశ్రుతి" ఉంచటం సౌందర్యస్ఫూర్తిలో పుష్పానికి తొడిమ ఉత్తమాలంబం అని కవిహృదయం కాబోలు.

"కవితాప్రభాస"
భీమవరం.

నండూరి రామ కృష్ణమాచార్య
సర్వజిత్ సంక్రాంతి.

# ఆలోకనము

## శ్రీ శివ శంకర శాస్త్రి

[ ౧ ]

శ్రీ పాపయ్య శాస్త్రి గారి నామాంతరము కరుణశ్రీ. ఔత్తరాహకవులు విశేషించి హిందీభాషాకవులు తఖల్లుస్ ధరింతురు. ఏతత్కవి హిందీభాషా విశారదు డగుటచే తత్పద్ధతి నవలంబించినాడు. అంతేకాని, నిజనామధేయమును మరగుపరచి, ఆరోపితనామమును గ్రంథములపై నుల్లేఖింపవలసిన యవసరము లేదు. కవిలోకమున ఈయనకు ఖ్యాతి యున్నది.

లోకయాత్ర దుఃఖభూయిష్ఠ మగుటచే కోమలమనస్కులకు కరుణయే ప్రధానముగా గానబడును. ఇట్టివారికి దయావీరులయెడ తాత్పర్యము మెండుగా నుండును. ఈకవి ఆర్ద్రహృదయు డనియు, కరుణరసవాది యనియు ముఖావలోకమున గ్రహింప వచ్చును. ఏతల్లక్షణలక్షితు డగుటచేత నే కరుణానిధి యని పేరు వడసిన బుద్ధుని కథాఘట్టములను కూర్చి, కావ్య మల్లి, "కరుణశ్రీ" యను నభిఖ్య యుంచుట సంభవించినది. ఈ యారుఘట్టముల సమాఖ్య 'కరుణశ్రీ' కావ్యమున ప్రథమఖండము.

[ ౨ ]

ఆదిలో బుద్ధునిగూర్చి రచించిన ప్రమాణగ్రంథ మేమియును లేదు. ఆయన రచించిన సిద్ధాంతగ్రంథ మేమియు లేదు. బుద్ధునిబోధ లున్న వను "ధమ్మపదము" కూడ తద్విరచితమే యని చెప్పుటకూడ సముచితము కాదు. గౌతమబుద్ధుని శిష్యుడై, నిరంతర మాయన ననుసరించిన ఆనందుడుకూడ గురుచరిత్ర రచింపలేదు. జీవితఘట్టములకంటె శిష్యులకు బోధ ప్రధానమై యుండెనని యూహింప వచ్చును. ఆకాలమున 'జీవితచరిత్ర' రచించు పరిపాటి లేదు.

ఒకటిమాత్రము జరిగినది. ఆనందుడు, తదితరభిక్షువులును, గురూపదేశములను మౌఖికముగా నితరుల కందిచ్చినారు. వానిలో బుద్ధుని చరిత్రాంశములు కొంచెము కొంచెము లభించినవి. అయ్యవి 'పాలి' భాషలో నిబద్ధము లయినవి. వానినిబట్టి బుద్ధు డెట్టివాడో, బోధ లెట్టివో ఆయనవిజయము లేలాటివో గ్రహింప నవకాశము కలదు.

'వినయ' పిటకాంతర్గత మగు 'మహావగ్గములో' గోతముడు బుద్ధు డైనపిదప కొన్ని సందర్భములును, సంఘసంస్థాపనయును వర్ణితములు.

కొన్ని కొన్ని 'సుత్తములలో' (సంవాదములు) గోతముడు నిజసాధనను గూర్చియు, కొందరు లోకులతో తన సన్నివేశములను గురించియు వివరించినాడు. ముఖ్యముగా 'మజ్ఝిమ నికాయ'మున ఆయన స్వరూపస్వభావములు గోచరించును.

'ధమ్మపదము'లోను, 'ఇతివుత్తకము'లోను బుద్ధునిబోధలు కానవచ్చును. 'జాతక కథ'లకు పీఠికాప్రాయమయినది 'నిదాన'కథ. దీనిలో గోతముని జననము మొదలు కొని, ఆయన బుద్ధు డయినపిమ్మట నిజకుటుంబమును దర్శించువరకును కథ కలదు. మహావగ్గము, సుత్తములు బుద్ధనిర్యాణానంతరము కొన్నిశతాబ్దులకు లిఖితరూపము దాల్చినవి. ఆయన గతించిన వేయిసంవత్సరములకు సింహళములోని సంఘారామములవారు 'నిదానము' లిఖించినారు. క్రీ. శ. ద్వాదశ శతాబ్దిలో 'జినచరితము' అను కావ్యమును సింహళములో బుద్ధదత్తుడు రచించినాడు. బుద్ధనిర్యాణానంతరము రెండువేల సంవత్సరములకు 'మాలాలంకారవత్తు' విరచిత మైనది. ఇవి యన్నియు 'పాలి' భాషలో నున్నవి.

సంస్కృతభాషలో అశ్వఘోషుడు 'బుద్ధచరితము' కావ్యముగా కూర్చినాడు. బుద్ధఘోషుడు 'పద్యచూడామణి', 'సౌందరనందము' అను కావ్యములు రచించినాడు. మొదటిదానిలో బుద్ధునిచరిత్ర కొంతవరకు గలదు. రెండవదానిలో బుద్ధుడు నందునకు దీక్ష యిచ్చుట, నందుని మనోవేదన, తుదకు శాంతియు వర్ణితములు. 'లలితవిస్తరము' అను మహాగ్రంథమున గౌతముడు సంబుద్ధిని పొంది వారణాశిలో ప్రథమ ధర్మప్రసంగము చేసినంతవరకునుకథ కలదు.

"జినచరితము' అను వచనకావ్యము వాదీభసింహుడు చేసినాడు. "పాలి"భాషా రచనలే ప్రమాణములు. అందు ప్రాచీనగ్రంథములే ప్రధానములు. సంస్కృత గ్రంథములలోని గాథ లన్నియు సత్యము లనుటకు వీలులేదు. బుద్ధచరితమునకు, పద్య చూడామణికి, లలితవిస్తరమునకు కొన్ని సందర్భములలో వైరుధ్యము లున్నవి. నామధేయములలోగూడ భేదములు గోచరించుచున్నవి.

Oldenberg, Cowele, New, Childers, Fausboll, Rhys, Davids దంపతులు, శీలాచారభిక్షు, హరప్రసాద శాస్త్రి, సతీశచంద్ర విద్యాభూషణ, శ్రమణ పున్నానంద, అనగారిక ధర్మపాల, రాహుల సాంకృత్యాయన నాటి మహా విద్వాంసులు పాలి, సంస్కృతభాషలలో బౌద్ధగ్రంథజాలము మథించి, బహు విషయములు ప్రకటించినారు. Edwin Arnold 'లలితవిస్తరము' నాధారము చేసికొని రచించిన Light of Asia కావ్యములోని విషయములే మన దేశమున వ్యాప్తమయినవి. తిరుపతి వేంకటేశ్వరకవుల బుద్ధచరిత్ర కావ్యమునకు ఆర్నాల్డు గ్రంథమే యాధారము.

[ 3 ]

గౌతముడు జన్మించునాటికి శాక్యులు కోసలదేశమునకు కప్పము గట్టుచుండిరి. ఆయనతండ్రి శుద్ధోదనుడు శాక్యనాయకుడు. కపిలవస్తునగరము రాజధాని. రాష్ట్రము రమారమి 900 చదరపుమైళ్ళ వైశాల్య ముండెను. దానికి తూర్పున రోహిణీనది, పశ్చిమ దక్షిణముల అచిరావతీ నదియు ప్రవహించుచుండెడివి. ఉత్తరమున హిమాలయపర్వతశ్రేణి. శుద్ధోదనుని వారకమున గౌతముడు జన్మించెను. శుద్ధోదనుడు ప్రభువుకాడు; కొన్ని బౌద్ధగ్రంథములలో రాజనియు, థేరగాథా వ్యాఖ్యలో మాత్రము మహారాజనియు కానబడును. పురాతత్త్వవేత్త లాయన చిన్న నాయకు డని నిరూపించినారు. గౌతముడు క్షత్రియుడైనను బ్రాహ్మణ గోత్ర నామమే అనుశ్రుతముగా వచ్చినది. శైశవమున ఆయనకు సిద్ధార్థు డని పేరు. క్రీ. పూ. రమారమి 560 సంవత్సరమున ఆయన జన్మించినాడు. కోలియ నాయకులబిడ్డయైన మాయాదేవి ఆయనతల్లి.

సిద్ధార్థుడు పుట్టగానే అసితుడను వృద్ధుడు వచ్చి, శిశువు మహానుభావుడగు నని చెప్పిపోయెను. ఒకానొక యైతిహ్యప్రకారము శిశూదయ మయినతర్వాత తల్లి పోయిన దనియు; ఆమె చెల్లెలును, శుద్ధోదనుని ద్వితీయభార్యయు నగు ప్రజావతీదేవి శిశువును పెంచె ననియు ప్రతీతి.

సిద్ధార్థుడు సక్రమముగా బ్రాహ్మణులవద్ద కొంతవరకు వేదాధ్యయనము చేసినాడు; క్షత్రియోచితము లైనవిద్య లన్నియు నేర్చినాడు. బహుప్రయాణములు చేసినాడు. గిరివ్రజదుర్గమును నవీన రాజగృహనగరమును దర్శించినాడు. చాతుర్మాస్యలలో వైదికధర్మములను సనాతన సంప్రదాయములను కొంత కొంత అవగాహనచేసినాడు. మగధ కోసలరాజ్యముల నడుమ పెరుగుచున్న స్పర్థను గ్రహించినాడు. రాజకీయ సామాజికవిషయములను బాగుగా నవగతము చేసికొన్నాడు.

క్షత్రియులకు బ్రాహ్మణులయెడ విశేషప్రతిపత్తి యున్నను కొంత మాత్సర్యము కూడ లేకపోలేదు. బ్రాహ్మణులు ప్రబలు లగుచుండుట వారికి గిట్టలేదు. కుమారుడు చక్రవర్తియై అందరకన్న మిన్న కావలె నని శుద్ధోదనునియాశ. కాని గౌతముడు నిరంతరము గ్రామీణులను ఆటవికులను దీనులను జూచుచుండుటచే నతని మానసమున లోకము దుఃఖభూయిష్ఠ మనుభావము గాటముగా హత్తుకొనెను. క్రమముగా నాతనికి వివాహ మయ్యెను. అతడు తండ్రితోపాటు రాజకార్యప్రవృత్తు డయినాడు. వైద్యవిధానము గ్రహించినాడు. ఆగంతుకు లగు వివిధ మతవాదులతో సంభాషించుచుండెడివాడు. అతడు మననశీలి యగుటచే జగత్కల్యాణ మెట్లు సంపాదింప దగునని భావించెడివాడు. తుదకు ఇరువది తొమ్మిదవయేట కృతనిశ్చయు డయి గృహత్యాగము చేసినాడు. కుమారుడు కలిగినాడని వార్తాహరులు వచ్చి చెప్పినపుడు బిడ్డనికి రాహులనామ ముంచ మని యాదేశించి చనినాడు. సంపదలను సౌఖ్యములను ధైర్యముతో విసర్జించుటచే బుద్ధునిచరిత్ర జనాకర్షక మయినది.

[ ౪ ]

ఆధునిక సమీక్షావిధానములను గ్రహించినవా డగుటచే ఈకవి యెచ్చట నెంత వరకు వర్ణన యుచితమో, ఎచట సంభాషణ సమంజసమో గ్రహించి, వినుగు

త్రోపనీయక కమనీయమార్గమున కావ్యము నడపినాడు. ఈవిధానము, శైలియు మహాకావ్య నిర్వహణమునకు సమర్థములు.

పాపయ్య శాస్త్రిగారి రచనలో పదలాలిత్యము, ధారాశుద్ధి, పాకపరిపక్వము ప్రస్ఫుటములు. ఈకావ్యమున నీరస మగు పద్యము వినబడదు. ఈయన హృదయ వాది కవిశ్రేణిలోని వాడు.

'కరుణశ్రీ' లో అలంకారరూపమున సాహిత్యసిద్ధాంతములు గోచరించుచున్నవి.

"ఒడుదుడుకు లేని పథములం బడి రథమ్ము
నడుచుచుండెను సుకవి ఛందమ్ము మాడ్కి"
"కరుణకవి కావ్యమ ట్లనుద్ఘాత లలిత
మృదుల శయ్యాక మగు తేరు పదిలపరచె."—
"రమణీయ కావ్య సారస్య మాస్వాదించి
కమనీయ సాహితీ క్రమము లెరిగి"—

"మహాకవీంద్ర భా
వాంబరవీధి విశ్రుతవిహార మొనర్చు రసార్ద్రభావనా
లంబి సరస్వతీ చరణలాస్య విలాసములు...."
" 'అక్షరదీక్ష' గైకొని 'పదార్థవిదుం' డయి 'వాక్యకల్పనా'
దక్షత నంది, 'రీతి గుణధర్మ' విభేద మెరింగి' 'వ్యంజనా
లక్షణలన్' గ్రహించి, సమలంకృతులం గృతులం బఠించి, శా
క్య క్షితిపాలనందనుడు కాంచెను విశ్వకళారహస్యముల్."

కావ్యస్వరూప స్వభావములే కాక కవిశిక్షకూడ నిందు చిత్రిత మైనది.

సమాసఘటనలో ఈ కృతికర్త నేర్పరి. "నిర్మలాంబునిష్యంద మహా హిమాచల తటాంచల చంచల గాంగనిర్ఝరము;" "ప్రశాంతమాధురీ మసృణమనోజ్ఞదివ్య సుషమా సుకుమారు;" "మనోజ్ఞమానససరోవర హైమమృణాలవల్లరీ భోజనరాజభోగ పరిపుష్ట మరాళశరీరమాంసముల్." ఇత్యాదులు.

అర్థాంతరన్యాసరూపమున సూత్రప్రాయము లైన సూక్తులు కొన్ని కనబడు చున్నవి: "బలమా ప్రజలకు మనకృషీవలుని హలము;" "తలలు వంచరు కాదె స్వాతంత్ర్యధనులు;" "దుఃఖసుఖమ్ములు శాశ్వతమ్ములె మారకయున్న మానవుల మానసముల్ భరియింప గల్గునే;" "భావిగతి భావింపంగ రాదెరికిన్."

ఉత్సాహాతిశయమును జూపుటకు "సవిత్రి సకౌతుకమ్ముగా కని కని కాంచి కాంచి మరి కన్గొని కన్గొని స్నేహపూర్ణయై" అని చమత్కారముగా కవి యొకచో కూర్చినాడు.

ఈ పద్యమున కల్పన మెంతయు కమనీయము—

"అంకురమై రసోల్లసితమై కొనసాగి, నవప్రవాళ రే
ఖాంక దళాంచలోచ్ఛలితమై నరనాథు నదృష్టవల్లి న
ల్వంకల బ్రాకి సౌరభములన్ విరజిమ్ముచు, పుష్పమండలా
లంకృతులన్ మనోరథఫలప్రద మయ్యె గ్రమక్రమమ్ముగన్."

బాణహతిచే నేల వాలిన హంసను సిద్ధార్థుడు లాలించుపట్టు సహజక్రియాశోభతో విరాజిల్లుచున్నది:

"రెక్కలు దువ్వి వీపు సవరించి, పదమ్ములకుంటు దీర్చి, లే
జెక్కిలి చక్క దిద్ది, సరి చేసి తనూలత, ప్రేమపూర్ణమౌ
వాక్కులు పల్కుచున్, దిగులు వాపుచు, ముద్దుల బుజ్జగించుచున్
మక్కువ మీర గౌతమకుమారుడు లాలన సేయుచుండగన్—"

పాపయ్య శాస్త్రిగారికి పైరుపచ్చలు, గ్రామీణజీవితము పరమప్రీతిభాజనము లనిపించును. నిదర్శనార్థము :

"సరససౌవర్ణవర్ణ సస్యప్రపూర్ణ
నేత్రపర్వ మొనర్చు నీ క్షేత్రలక్ష్మి;
పంటకంకులబరువుతో వంగి, చిన్ని
బాలు నెత్తిన బాలింతరాలు వోలె."

"అక్క, యీ కొండకాల్వ యాప్రక్కనుండి
పరుగులిడి వచ్చె నొకపల్లెపడుచువోలె."

"నిండు వేసంగిలో మండుటెండలందు
కష్టపడి కర్షకులు రాల్చు ఘర్మజలము
ఫలముగా మారె నేటి కీపొలమునందు."

"కండెలు కంకులున్ బనసకాయలు తీయని నారికేళపున్
బొండము, లారగాచి వడపోసిన కమ్మని యావునేతితో
నిండినకుండ లౌదలల నింపి, కరమ్ముల ముద్దబంతి పూ
దండలు దాల్చి కాపుగరితల్...."

"కొాదమగిత్తల దోలుకొని పోవుచున్నాడు
సేద్యకాడామూల చేను దున్న
గుగ్గిళ్ళకై కోసికొనుచుండి రాపైపు
కాపుకన్నెలు క్రొత్తకందికాయ
గొల్లబొట్టెలు మేపుకొనుచున్నవా రదే
ఆలమందల శాద్వలాలయందు
అల్లదే ఎదురుగా నరుదెంచుచున్నాడు
పాలకావడితోడ పాలికాపు...."

'కరుణశ్రీ'లో నవేక రమణీయఘట్టములు కలవు. ప్రభువున కుపాయనములు తెచ్చుదృశ్యము, జోలపాట, తండ్రి కుమారుని ముద్దాడెడుపట్టు, గౌతముని వన విహారము, రాజహంసోదంతము మిగుల హృదయంగమములు. కావ్యమునం దెచ్చట జూచినను లాలిత్యము జాలువారును.

"మంజులపింఛముల్ గగనమండలమందు పదేపదే తటి
త్పుంజములన్ రచింప ఫణిభుక్కులు చక్కగ సల్పె నాట్యముల్;
కుంజకుమారికల్ సరసకోమలహస్తము లెత్తి భక్తిపు
ష్పాంజలులన్ వెలార్చినవి స్వామికి ప్రేమపరీమళమ్ముతో."

ఇట్టిరత్నము లెన్నో యున్నవి.

తిమ్మ నిడి, స్వాగత మ్మొసగె, స్నేహితుడు, లగించి మొదలగుపదము లీ కావ్యమున నిబద్ధములయినవి. బహుకవిప్రయోక్తములగుటచే నివి గ్రాహ్యము లగుచున్నవి. సంస్కృతవాణిలో మాత్రము స్వాగతం వ్యాజహార, అనియు, మిత్రమునకు స్నిగ్ధః అనియు నుండును. జోలపాటను, లాలిపాటను ప్రణయగీతి అనుటవలన ప్రణయశబ్దము నత్యంతప్రీతి యను నర్థమున కవి ప్రయోగించినట్లు తోచును. ఇంతియే గాక, పెద్దదొరసాని, పసిబాబు, కజ్జాయము, లేడిబుజ్జాయి, మొదలగు ముద్దుపదములుగూడ నందందు గానబడుచున్నవి.

అహింసావాదము సముచితముగా కవి నిరూపించినాడు.

మాధుర్య ప్రసాద గుణ సమంచితమై, కైశికీవృత్తి నలరారుచు, ద్రాక్షాపాక ప్రచురమైన యీ కావ్యము కడుంగడు హృదయంగమము.

ఇతి శివమ్

శి. శా.

రాజమహేంద్ర వరము. సాహితీ సమితి.

సర్వజిత్ పుష్య అమావాస్య. మహోదయము.

# నివేదనము

## బుద్ధభగవానుడు – క్రీస్తుప్రభువు – గాంధీమహాత్ముడు

అంధకారబంధురమైన ప్రపంచంలో అహింసాజ్యోతి వెల్గించిన అమరమూర్తు లీ ముగ్గురూ. అఖండమైన త్యాగంతో, అచంచలమైన కర్తవ్య దీక్షతో, అనన్య సామాన్యమైన ఆత్మార్పణంతో విశ్వాన్ని పులకింపచేసిన త్రిమూర్తులు వీరు. ఈ దివ్యమూర్తుల కన్నుల్లోని అశ్రుధారా, గుండెల్లోని రక్తధారా, కంఠంలోని అమృతధారా కలిసి జగత్కాలుష్యాన్ని కడిగి మానవజాతిని పునీతం చేశాయి. ఈ ముప్వురు మహాత్ముల్లో బుద్ధదేవుడూ, పూజ్యబాపూజీ మన జన్మభూమిలోనే జన్మించారు. ఇది భారతావనికి ప్రపంచంలో ప్రత్యేకంగా ప్రాప్తించిన పరమసౌభాగ్యం.

ఎందుకోగాని బుద్ధునిపేరంటే భారతమేకాదు ప్రపంచమే పొంగిపోతుంది. మానవహృదయం స్వతస్సిద్ధంగా కరుణాత్మకమై బుద్ధుడు సహజంగా కరుణామయుడు కావటమేనా ఇందుకు కారణం! లేకపోతే రామునిమీద కంటె కృష్ణునిమీదకంటె బుద్ధునిమీద దేనికీ దీనికింత మమకారం?

బుద్ధుడు నా ప్రభువు - నా ప్రేమమూర్తి - నా ఆదర్శజ్యోతి - నా అరాధ్యదైవం - నా ప్రభువు ప్రపంచంకోసం సమస్తభోగభాగ్యాలు పరిత్యజించాడు. నా కరుణమూర్తి అరణ్యాల్లో ఆరుసంవత్సరాలు అలమటించి చివరకు బోధివృక్షం నీడల్లో బుద్ధుడై అమరసందేశాన్ని అందుకొని అశేషప్రజానీకం హృదయాలపై అమృతవృష్టి కురిపించాడు. ఆయన అడుగుల్లో శాంతి వెల్లివిరిసింది. ఆయన చూపుల్లో కారుణ్యం పొంగులువారింది. ఆయన మాటల్లో అహింస గంగానదియై ప్రవహించింది.

"కరుణశ్రీ" అన్నది ఈ కావ్యానికి సాంకేతికనామం. "కరుణశ్రీ" అంటే బుద్ధుడని నా నిర్వచనం. ఎన్నోరాత్రులు ఆలోచించాను; ఇంతకంటె మంచి

పేరు స్ఫురించలేదు. "రాముడు" "కృష్ణుడు" నామములవలె "కరుణశ్రీ" అనే కవి ఉపనామంకూడా ప్రభువునందలి భక్తికి సూచకమని ప్రాజ్ఞులు గుర్తించగలరు.

బుద్ధజీవితమంతా నాలుగుభాగాలుగా విభజింపబడింది. ఇది మొదటిభాగం. ఇందులో బుద్ధదేవుని జననం మొదలు రాజహంసకు ప్రాణదానం చేయడం వరకు కథ వర్ణింపబడింది. మిగిలిన భాగాలుకూడా సాధ్యమైనంత త్వరలో సహృదయసాన్నిధ్యం సంపాదించుకోగలవు.

ప్రథమంగా శ్రీ తిరుపతి వేంకటకవుల "బుద్ధచరిత్రము" నన్ను ఆకర్షించింది. అనంతరం ఆంధ్ర సాహితీమతల్లికి అమూల్యశిరోభూషణమైన శ్రీ "పింగళి" "కాటూరి" కవుల "సౌందరనందము" నాలోని బౌద్ధసౌహార్దాన్ని ప్రవృద్ధం చేసింది. క్రమంగా శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారి "చారిత్రకవ్యాసములు", శ్రీరామచంద్రశుక్లజీ "బుద్ధచరిత్", శ్రీఅనూపశర్మాజీ "సిద్ధార్థ" ఈ కావ్య రచనకు నాకు దోహదంచేశాయి. మిత్రమణులు శ్రీ హనుమంతరావుగారు నాకీ విషయంలో ఎంతో ప్రోత్సాహమిచ్చారు.

పూజ్యశ్రీ శివశంకరశాస్త్రిగారు "ఆలోకనము" అనుగ్రహించారు. సుహృన్మణులు శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులుగారు అపశ్రుతిలేని "ఉపశ్రుతి"ని అనురాగ పూర్వకంగా మేళవించారు. మిత్రులు "చిత్రశ్రీ" కృత్తివెంటి కృష్ణమూర్తిగారు ముఖచిత్రాన్ని ముద్దుగా దిద్దితీర్చారు. అందరికీ అభివందనములు అర్పిస్తున్నాను.

ఎన్నాళ్ళనుండో బుద్ధభగవానుని కరుణమూర్తిని సాహితీనయనాలతో సందర్శించాలని సముత్కంఠ. ఈనాడు నా ఆకాంక్ష ఒకరూపం ధరిస్తున్నదంటే 'ధన్యోస్మి.' ఈ ఆనందమయసమయంలో గురుదేవులు కుప్పా శ్రీఆంజనేయశాస్త్రి గారికీ, శ్రీ భమిడిపాటి వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారికీ నమస్కృతు లర్పిస్తూ "కరుణశ్రీ" ప్రథమభాగాన్ని తమ కరకమలాల్లో ఉంచుతున్నాను.

అమరావతి — తమ

౧౨-౨-౪౮ — "కరుణశ్రీ"

# కరుణశ్రీ

## ప్రథమ భాగము

సుఖస్వప్నము
శుభోదయము
నిశ్వాసము
సమున్మేషము
సానుభూతి
అనుకంప

భారత భాగ్యవిధాత
పూజ్య బాపూజీ
పుణ్య స్మృతికి



# సుఖస్వప్నము

ఏ దివ్యతేజస్వి యౌదార్యనిరతి బృం
దారకవితతి విం దారగించు
ఏ శాంతనిధి భావ వైశాల్య గరిమ ప్రా
క్పశ్చిమాంబుధుల కైక్యము ఘటించు
ఏ నిశ్చలధ్యాని మౌనముద్ర సమస్త
భారతావనికి సౌభాగ్యరక్ష
ఏమేటి యౌన్నత్య మీనాఁటి కానాఁటి
కేనాఁటి కెవ్వ రూహింపలేరు
ఏ సదయమూర్తి హృదయ వాహినుల చలువ
మంటిలోనుండి బంగారుపంట లెత్తు
ఆ మహీధరమండలస్వామి యలరు
నలఘు మహిమాలయమ్ము హిమాలయమ్ము

ఈ హిమశైలరాజమున కించుక దక్షిణమందు రోహిణీ
వాహిని యొడ్డునన్ గపిలవస్తుపురమ్ము సమస్త వస్తు స
న్మోహకమై విరాజిలు సమున్నత సౌధ చిరత్న రత్న సం
దోహ కళా విలాసములతో జితదైవతరాజధానియై

ఆ దరహాసభాసుర ముఖాంబురుహమ్ము నిజప్రజాళి కా
మోదము గూర్ప శాక్యకుల ముఖ్యుఁడు తత్పుర మేలుచుండు శు
ద్ధోదన మేదినీపతి శుభోదయుఁడై యనురాగ రంజితా
హ్లాదకర ప్రబుద్ధ కమలాకరుఁడై సుమనోభిరాముఁడై

క్షాత్రకులావతంసుఁడగు శాక్య నృపాలు విశాల శీతల
చ్ఛత్రము క్రింద స్వేచ్ఛగ - ప్రశాంతిగ - కాలముబుచ్చుచుండు రే
మాత్రము లోటులేక యసమానత కెక్కడ చోటులేక సా
ర్వత్రిక సౌఖ్యజీవన పరంపర తామరతంపరై ప్రజల్

ఐక్యము డిగ్గలేదు ప్రజలందు - వెలందుల నాత్మగౌరవా
ధిక్యము తగ్గలేదు - రణధీరులు పూరుషు లెల్ల - రత్న మా
ణిక్యములే కుమారులు - పునీతము ధర్మము - లోపమెన్నఁగా
శక్యముగాదు శాక్యపరిషత్పరమేశ్వరు పాలనమ్మునన్

## సుఖ స్వప్నము

ఆ యుర్వీవిభుఁ డాభిజాత్యవతు లన్యోన్యానురక్తల్ మహా
మాయాదేవి మహాప్రజావతి యసామాన్యల్ యశోధన్యలా
జాయారత్నము లిర్వురుం గొలువ నిచ్చల్ వొల్చు నా పద్మినీ
ఛాయా సంగతి సప్తరశ్మి గతి నిస్తంద్రప్రభాసాంద్రుఁడై

శాంతి అహింస యొక్కటయి సత్యముతో జతగూడి నట్లు, వి
క్రాంతియుఁ గాంతియున్ బురుషకారముతో సమసించినట్లు, వా
సంతికయున్ లవంగియు రసాలముతోఁ బెనగొన్నయట్లు ల
క్కాంత లనారతమ్ము ప్రియకాంతు భజింతు రభిన్నమూర్తులై

ఆ కలకంఠకంఠుల రసార్ద్రి రహః ప్రణయైక కాకలీ
శ్రీకి వసంతుఁడై గుణవశీకృత సర్వదిగంతుఁడై ప్రజా
నీకము నేలు రాజు నిజనిర్మల కీర్తిపతాక లుల్లస
న్నాక తరంగిణీ విలసనమ్ముల నుల్లసమాడుచుండగన్

స్యందనపంక్తులా తురగజాలములా గజరాజులా స్ఫుర
న్మందిరపాళులా సుభటమండలులా ధనధాన్యరాసులా
యెందుఁ గొరంతలేదు మనుజేంద్రునకున్-గరవయ్యె జీవితా
నందరసైకకంద మొక నందన ముగ్ధ ముఖారవిందమే !

ఆ యినవంశ వార్నిధి హిమాంశుని పట్టపుదేవియౌ మహా
మాయ యనన్య దివ్యమహిమామయి నాథుని ప్రేమడోలలో
నూయలలూగుచుఀ నిదుర నొందినదై కనియెం బ్రమోద సం
ధాయకమైన స్వప్న మొకనాఁటి ప్రశాంత నిశాంతమం దిటుల్

సుందర మందహాస పరిశుద్ధ కపోలలు దేవదూతికల్
కొందరు వచ్చి పుష్పకములోఁ గొనిపోయిరి - నిర్మలాంబు ని
ష్యంద మహా హిమాచల తటాంచల చంచల గాంగ నిర్ఝర
మ్మందు సుఖమ్ముగా జలకమార్చిరి - పుణ్యవతీ వతంసముఀ

మలయ మరుత్ కుమార సుకుమార సుఖంకర చారుచామరాం
చల చలనమ్ములోఁ బరవశత్వము నందుచు శైలవాహినీ
కల లహరీ విలాసములు గాంచుచు దైవనితంబినీ కుతూ
హలకృత నవ్యదివ్యకుసుమాంబరభూషణభూషితాంగియై

ఒక్క సువర్ణ పీఠిఁ గొలువుండఁ గనుల్ మిఱుమిట్లు గొల్పుచుఀ
జిక్కని నీలి నింగి తెర జీల్చుక షట్కిరణ ప్రదీప్తమౌ
చక్కని చుక్క యొక్కటి దిశావలయమ్ముల దీప్తిపుంజముల్
గ్రక్కుచు వచ్చి దక్షిణముఖమ్ముగఁ జొచ్చెఁ దదీయగర్భముఀ

# సుఖ స్వప్నము

కాంత విచిత్రమైన కలగాంచి చివాలున మేలుకాంచి భూ
కాంతుని నిద్రలేపి కలగన్న తెఱం గెఱిగింప రాజు కా
ర్తాంతిక ముఖ్యులం బిలిచి ప్రాంజలియై తనరాణి స్వప్న వృ
త్తాంతము సాంతముం దెలిపి తత్ఫలిత మ్మడుగంగ వారలున్

జయమగుఁగాక మా కొలముసామికి - పట్టపుదేవికిన్ శుభో
దయమగుఁగాక - శాక్యజనతాపరితోష పయోధికిన్ మహో
దయమగుఁగాక - స్వప్నము నితాంత సుఖాంతము-సర్వథా సుతో
దయ ఫల సూచక మ్మిది యథార్థము ! పార్థివ పాకశాసనా !

సకల కళా విశారదుఁడు - సౌమ్యుఁడు - సత్యతపస్వి - ధర్మసా
ధకుఁడు - మహానుభావుఁడు - సుధామధుమూర్తి - సమాశ్రిత ప్రజా
సుకృత సుజాతుఁ - డంచిత యశోధరుఁ - డానత సర్వభూమి భృ
న్మకుట విరాజితాంఘ్రి - సుకుమారుఁడు నీకుఁ గుమారుఁడౌ ప్రభూ!

అని దైవజ్ఞశిఖామణుల్ పలికి శాక్యస్వామి లోమెచ్చి యి
చ్చిన కాన్కల్ గ్రహియించి దంపతుల కాశీస్సుల్ ప్రసాదించుచుం
జనినా రా ప్రియవృత్తమున్ విని జనుల్ సంతుష్టులైనారు నిం
డిన వల్లల్లన రాజ్ఞికిన్ నెలలు పండెన్ రాజు సౌభాగ్యముల్

కరుణశ్రీ

పరమానంద రసాతిరేక కరుణా
బాష్పాభిషేకమ్ములన్
చిర కౌతూహల భావ బంధుర శుభ
శ్రీగంధ లేపమ్ములన్
పరిపూర్ణ ప్రణయానురాగమయ
దృక్పంకేరుహ శ్రేణులన్
ధరణీ కాంతుఁడు ప్రేమపూజ లిడె
నంతర్వర్తినియౌ పత్నికిన్

# శుభోదయము

శ్రీపతీ ప్రేమ లజ్జాభిరామ వదన
వారిజాతమునుండి వెల్వడు పెతడవు
తీర్చు వెనువెంటనే ధరిత్రీధవుండు
సౌహృదము మీర దేవేరి దౌహృదములు

దేవదహమున కరుగ నర్థించు దేవి
భావము గ్రహించి శాక్యభూపాలమౌళి
కరుణకవికావ్యమ ట్లనుద్ఘాత లలిత
మృదులశయ్యాక మగు తేరు పదిలపరచె

రాగరంజిత నిజమనోరథము వోని
రథము నెక్కి సఖీ సహస్రములతోడ
ననుఁగుచెల్లి ప్రజావతి యనుగమింప
రాణి పుట్టిల్లుసేరఁ బ్రయాణమయ్యె

# శుభోదయము

సలిల సంపూర్ణ మంగళ శాతకుంభ
కుంభ వలయిత కదళికా స్తంభ చలిత
లలిత తోరణమాలికా కలిత పథము
నిండుచూలాలి కన్నుల పండువయ్యె

ఒడుదుడుకు లేని పథము వెంబడి రథమ్ము
నడచుచుండెను సుకవి ఛందమ్ము మాడ్కి
అక్క-సెల్లెండ్రు ప్రకృతికావ్యమ్ములోని
సరసఘట్టమ్ములను సమీక్షణమొనర్ప

చెల్లి ! కనుగొమ్ము గిరికులశేఖరుండు
శిరసు పైకెత్తుకొని విరాజిల్లు విధము
చలనము నెఱుంగఁ డెన్ని వర్షములకైన
తలలు వంచరు గాదె స్వాతంత్ర్యధనులు

వల్లకాట వసించెడివానిఁ బిలిచి
పిల్లనిచ్చి యిల్లఱికమ్ము వెట్టు నెవఁడు ?
ఈ మహారాజు చలువగాదేమి ! చేసి
కంటివాఁడయ్యె తా నొకయింటివాఁడు

## శుభోదయము

ఇచ్చోటనే త్రోసిపుచ్చె వరూధినీ
ప్రణయబంధము పిచ్చిబ్రాహ్మణుండు
ఇచ్చోటనే తిష్ఠ నిడి నిష్ఠ గొనె మనో
రథసిద్ధికై భగీరథ నృపుండు
ఇచ్చోటనే పొంగులెత్తి నేలకు దూకె
నమృతంపువెల్లి గంగమ్మ తల్లి
ఇచ్చోట నిచ్చోటనే పచ్చవిల్కాని
కరగించె ముక్కంటి కంటిమంట
ఇచ్చటే యిచ్చటే హృదయేశ్వరునకు
కొండరాచూలి వలపులు గ్రుమ్మరించె
ననుచు విద్యాధరాంగన లనుదినమ్ము
చెప్పికొనుచు విహారముల్ సేతు రిచట

ఆలపింతురు వీణియల్ మేళవించి
కిన్నరస్త్రీలు సురతరంగిణి తటాల
కమ్ర కరకంకణ క్వణ క్వణన తాళ
లయలు వెలయంగ నీ హిమాలయ యశమ్ము

కరుణశ్రీ

సోదరీ! గాంగ గతులలో శ్రుతులు గలిపి
పాడుకొన్నారు స్వేచ్ఛగా బ్రహ్మఋషులు
ఆడుకొన్నారు యుగసంధ్యలందు నిగమ
బాలు రిచ్చోట నాల్గు స్తంభాలయాట

వేదశాఖల ప్రాతశ్శుభోదయముల
నుపనిషద్వాల ఉయ్యాల లూగి రిచట
ధర్మదేవత నాల్గు పాదాలతోడ
చెంగలించిన దిట తట ప్రాంగణముల

"అక్క! ఈ కొండకాల్వ యా ప్రక్కనుండి
పరుగు లిడి వచ్చె నొక పల్లె పడుచువోలె
మనలఁ గనుఁగొని యల్లంత మరలి మరలి
మలక లగు చూడు మా కుతూహల దిదృక్ష

సరస సౌవర్ణవర్ణ సస్య ప్రపూర్ణ
నేత్రపర్వ మ్మొనర్చు నీ క్షేత్రలక్ష్మి
పంటకంకుల బరువుతో వంగి చిన్ని
బాలు నెత్తిన బాలెంతరాలు వోలె

# శుభోదయము

హృదయ తాపము దీర సౌహృదము మీఁ
శ్రీఘనశ్యామమూర్తి వర్షించినాఁడు
తొలకరింపుల భూదేవి పులకరించి
రాజనము లెత్తె ప్రణయ నీరాజనములు

నిండు వేసంగిలో మండు టెండలందు
కష్టపడి కర్షకులు రాల్చు ఘర్మజలము
ఫలముగా మారె నేటి కీ పొలములందు
బలము ప్రజలకు మన కృషీవలుని హాలము

చెట్టుకొ మ్మెక్కి కట్టెలు కొట్టుచున్న
కటిక నిరుపేద మీది యక్కటిక మెంతొ
స్నిగ్ధ హృదయానుభూతి నందించినావు
ఆర్ద్రనయనాల ఆణి ముత్యాల మాల!!

నిన్నుఁ బంపింప మన రోహిణీ స్రవంతి
యెంతదూరము వచ్చినదే శుభాంగి!
పొంగి పొరలెడి భావ తరంగ తతుల
చల్లచల్లఁగ పన్నీరు చల్లుకొనుచు

కరుణశ్రీ

అక్కఁ! కనుగొమ్మశోకమ్ము చక్కఁదనము
గుమ్మటముమాడ్కి ముద్దులు గులుకుచుండె
శీతలచ్ఛాయలను ప్రదర్శించి మనలఁ
బిలుచుచున్నది కిసలయాంగుళులతోడ

ఎవ్వరో పంపినట్లు పర్వెత్తి వచ్చె
చెంగుచెంగున బాలకురంగ మదిగొ!
ఎంత బాగున్నదే! యింతలేసి నీలి
నీలి కన్నుల చక్కఁదనాల మోము"

అనుచు నన్యోన్యమును మాటలాడుకొనెడి
యక్కసెల్లెండ్ర మధుర రమ్యావలోక
తన్మయత్వమ్ములో దేవదహమువైపు
స్యందనము మెల్ల మెల్లఁగా సాగిపోయె

లలితలాస్య మయూర విలాసగతుల
సరస కోమల కిసలయాంజలి పుటాల
కోకిలా కాకలీ "కుహూ కుహూ" రవాల
నిలిచి స్వాగతమనె "లుంబినీ"వనమ్ము

# శుభోదయము

అంబర చుంబి కదంబ క
దంబ హరితపర్ణ పూర్ణతా కల్పిత కా
దంబిని శ్రిత పశుపక్షి కు
టుంబిని "లుంబిని"ని నృప కుటుంబిను లెదుటన్

కనుఁగొని తద్వన వైభవ
మునకు మనమ్ములఁ బ్రమోదముం బొంది సఖీ
జనముల కాజ్ఞాపించిరి
వినోదముగఁ గొంతతడవు విశ్రాంతి గొనన్

సంజాత కౌతుకాయత
కంజాత విలోచనముల కమనీయ లతా
కుంజమ్ముల సుందర సుమ
పుంజమ్ములఁ గనిరి శాక్యభూపాల సతుల్

ఆ యా దృశ్యమ్ముల గమ
నాయాస మ్ముపశమింప నారయుచు మహా
మాయాసుందరి సాంద్ర
చ్ఛాయావృత మొక్క నవ రసాలము క్రిందన్

---

స్పందన మాపించి సఖీ
బృందము కైదండ లిడఁగ ప్రియసోదరితో
క్రిందికి దిగి మహిమామయ
మందస్మిత భాసమాన మధురాననయై

కమ్మని పరిమళమ్ములు
జిమ్మెడి క్రొమ్మావికొమ్మ స్నిగ్ధారుణ హ
స్తమ్ములతో హాయిగ వ
క్షమ్మున కద్దుకొని తీయఁగా ముద్దుగొనన్

"ఇంతటి దయార్ద్రమతివి! ఇం కెంతవాడొ
కడుపులో నున్న చిట్టి బంగారుతండ్రి"
అని యనుఁగుచెల్లి పరిహాస మాడు నంత
రాజపత్నికి నొప్పు లారంభ మయ్యె

పావన మైన్మన ఆ లుంబినీ వనాన
బాల సహకారమంటప ప్రాంగణమున
రచిత రమణీయ పట కుటీరమ్ములోన
కనియె చక్కని బాలు నొక్కని సవిత్రి

## శుభోదయము

సహజ సముదాత్త భావనాశక్తినుండి
అమృతమయకావ్య ముత్పన్నమైనయట్లు
పరమకల్యాణి రాణి గర్భమ్మునుండి
విశ్వమోహనమూర్తి యావిర్భవించె

పుడమి పులకించె రవి నవస్ఫూర్తి గాంచె
నింగి నిర్మల మయ్యె నుప్పొంగె కడలి
మంద మలయానిల స్పర్శలందు కరగి
వికచతరుశాఖికలు పుష్పవృష్టి గురిసె

బుసబుస పొంగి ముద్దుగాని
పోయె నదే సెలయేటికన్నె సా
రస రస రామణీయక త
రంగితముల్ పసిపాప పాదముల్;
మిసమిస లాడుచున్న నుతి
మెత్తని బుగ్గలు చూచి యేమిటో
గుసగుస లాడుకొన్నయవి
గువ్వలజంటలు కొమ్మచాటునన్

ఆ శుభవర్తమానము రయమ్మున మాతలు వచ్చి తెల్ప భూ
మీశుఁడు పొంగిపోయి నగ రెల్ల నలంకృతి సల్ప బంచె నా
త్మాశయసిద్ధి సూచకము లౌ ధనధాన్య విభూషణావళుల్
రాసులు రాసు లర్థినికరమ్ము కరమ్ముల గ్రుమ్మరించుచున్

తళతళ లీను మంగళపతాకలతో గగనమ్ము రాయుచున్
పెళపెళ మ్రోగుచున్న జయభేరులతో దిశలన్ స్పృశించుచున్
జలజల రాలు దివ్యసుమజాలముతో మహి నాక్రమించుచున్
కళకళలాడు ప్రోలునకు కంజముఖిన్ గొనితేరఁ బంపినన్

పంకజపత్రనేత్ర లిరుప్రక్కల పరామరిసింప రత్నప
ల్యంకిక నెక్కి రాణి జయలక్ష్మివలెన్ నగరమ్ము సొచ్చె ప్రే
మాంకమునందు స్వీయహృదయ ప్రతిబింబముబోలు బాల మీ
నాంక మనోజ్ఞమూర్తి జననాంతరభాగ్యము లొల్కవోయఁగన్

# నిశ్వాసము

చల్లనితల్లి పెద్దదొరసాని కుమారుని గన్నవార్త యు
త్ఫుల్ల సరోజ సౌరభము పోలిక వెన్నెలవాక కైవడిఁ
పిల్లనగ్రోవి పాటవలె ప్రేమ సుధారస మాధురీ క్రియఁ
పల్లెల పట్టణావళుల ప్రాకె క్షణక్షణవర్ధమానమై

నేటికి శాక్యవంశరజనీ ద్విజరా జుదయించె నమ్మ ! యే
నాటి తపఃఫలమ్మొ వినినాముగదే వరహాలవార్త నో
పాటలగంధులార ! పసిబాబును చూతము రం డటంచు న
వ్వీటి వధూటు లెల్ల నృప వేశ్మము జొచ్చి రలంకృతాంగులై

కొందరు పద్మలోచనలు-కొందరు బాల కురంగలోచనల్
కొందరు మీనలోచనలు-కొందరు చారు చకోరలోచనల్
వందలు వేలుగా కపిలవస్తువు మేడలు డిగ్గివచ్చి రా
నందముతో కుమారుని గనంగ నపాంగరుచుల్ వెలార్చుచుఁ

అందము చిందువందినది - ఆశలు రాసులువోసికొన్న - వా
నందము పొంగులెత్తినది - నవ్వులు పువ్వులవానలైన - వే
మందిరమందు గన్న సుకుమార శుభోదయ కౌతుకమ్ములే!!
విందులె!! దానధర్మములె!! వేడుకలే!! ప్రియభాషణంబులే!!

అంచితభక్తిమై నృపతు లందరు దూతచయమ్ము వెంట బు
త్తెంచిరి పూజ్య శాక్యజగతీపతి పుత్ర మహోత్సవార్థమై -
కాంచన ఘంటికా కలిత గంధగజాళి మణిప్రసాధ నో
దంచిత వాజిరాజి సముదాత్త మనోహర తారహారముల్

పిల్లనగ్రోవులన్ నెమలిపించెములన్ గురివెంద పేర్లు గల్
గల్లునమ్రోగు గంట లరకాటుకకన్నులు గవ్వపోగులున్
తెల్లని పాలపూసలు సుదీర్ఘశరీరము లుల్లసిల్ల శో
భిల్లిరి భిల్లులెల్ల జయవెట్టుచు రాజగృహాంగణమ్మునన్

కండెలు కంకులున్ బనసకాయలు తీయని నారికేళపుం
బొండము లారగాచి వడవోసిన కమ్మని యావునేతితో
నిండినకుండ లౌదలల నింపి - కరమ్ముల ముద్దబంతి పూ
దండలుదాల్చి - కాపుగరితల్ సని రంతిపురమ్ము సేరగన్

తీయనిజున్నులన్ పుటకతేనియలన్ పులిగోళ్ల జాళువా
చాయ కురంగశాబములు చామరముల్ మృగనాభి ముంత క
ఙ్జాయము విప్పపూలు ఘనసారము పున్గు జవాది యాదిగా
కోయదొరల్ నృపాలకునకున్ గొనివచ్చి రుపాయనంబులన్

ఎటు గనినన్ మహోత్సవములే! విజయధ్వజ విభ్రమమ్ములే!
కటక కలస్వనమ్ములె! సుఖంకర కంకణ నిక్వణమ్ములే!!
భట పటల ప్రమోదభర పర్యటనమ్ములె!! ప్రోజ్జ్వల న్నటీ
నట నటనమ్ములే!! మణి గణాంచిత మంగళ తోరణమ్ములే!!

ఎన్ని యుగాలనుండియొ తపించుచు శైల గుహాంతరాళ మం
దున్న మహానుభావు "అసితుం"డను దివ్యతపస్వి మాయకుం
జిన్నికుమారు డుద్భవము జెందు టెరింగి యపార భక్తి సం
పన్న మనస్కుడై కపిలవస్తునకున్ విజయమ్ము సేసినన్

అసితమహర్షికిన్ పరమహర్షముతో నెదురేగి స్వాగత
మ్మొసగెను శాక్యభూపతి - శుభోదయ మాయ ప్రశాంతమాధురీ
మసృణ మనోజ్ఞ దివ్య సుషమా సుకుమారు కుమారు కౌతుకో
ల్లసిత ముఖాబ్జుయై మునిలలాముని ముందర దోయిలించినన్

ముద్దులుమూటగట్టు నవమోహన శాక్యకిశోరమూర్తి క్రొ
న్నిద్దపు నీలినిగ్గుల కనీనికలన్ గని యాత్మరూపమున్
బెద్దయు పొంగి భక్తి బ్రణమిల్లి ప్రదక్షిణసల్పి పెక్కుమా
ర్లద్దుకొనెన్ దదీయచరణాంబుజముల్ మునిమౌళి మౌళిపై

నేడు కృతార్థుడన్ ! జని పునీతము భారత భాగ్యరాశియా
వీడు రసార్ద్రమూర్తి ప్రభవిష్ణుడు శాంతిసుధాస్రవంతు లీ
రేడు జగమ్ములందు వెలయించు ఘనుండు వినుండు ! భూమిలో
నీ డెవ రిట్టివాని బ్రభవించిన పుణ్యవతీమతల్లికిన్ ! !

అని బహుభంగులన్ శిశుమహత్త్వము వాకొని రాజొనర్చు న
ర్చనలు గ్రహించి యేగె మునిరాజు - ప్రసన్నత నందె తల్లి వా
ల్గనుల ప్రమోదబాష్పములు కాలువలై ప్రవహింప చల్లి చ
ల్లని యొడిలో మనోరథఫలమ్మును మెల్లగ బుజ్జగించుచున్

అనుపమ దివ్యదీప్తిమయమై - శతకోటి శశాంక ముగ్ధ మో
హన కమనీయతాకలితమై - హృదయంగమ మైన యాత్మ నం
దన వదనమ్ము శాంతిసదనమ్ము - సవిత్రి సకౌతుకమ్ముగా
గనికని - కాంచి కాంచి - మరి కన్గొని కన్గొని - స్నేహపూర్ణయై

నా మధుమూర్తి! నా జయవినాదమ! నా రతనాలరాశి! నా
నోములపంట! నా చిరమనోరథసంపద! నా తపస్య! నా
ప్రేమఫలమ్మ! నా మనసుపెన్నిధి! సన్నిధి సేసినావె కం
దామరలందు సాత్విక సుధల్ విరజిమ్ముచు నిన్నినాళ్ళకుఁ!!

చిక్కని ముంగురుల్ మిసిమిచెక్కులు ప్రేమ సుధా ప్లుతమ్ములౌ
దృక్కులు చూచినఁ తనివిదీరద యెంతకు - నింతకాలమో
చక్కనితండ్రి! యే తెరలచాటున ఏ తెలిమబ్బు మాటునఁ
నక్కితివోయి! మాయ నయనమ్ములకుఁ గనరాని దొంగవై!!

ఎన్ని భవమ్ములందొ గడియించిన పున్నెము పండి నే డిటు
చిన్ని కిశోరమూర్తి! దయచేసితి నా ప్రణయాంకపీఠికిఁ!!
పున్నమ చందమామ సరిపోలిన నీ ముఖమందు తీయనౌ
వెన్నెల త్రావి త్రావి రుచివీడవు మామక దృక్చకోరముల్!!

మంగళమూర్తి! నీ మధుర మంజుల మోహన రూప మాధురీ
గంగా తరంగ డోలల సుఖంబుగ నూగిన యంతరంగ మే
భంగి భరింపగల్గు భవబంధము? నిన్ను లయించుకొన్న క
న్నుంగవ యెట్లు వెండియు కనుంగొను నీ వికట ప్రపంచముఁ?

అక్క - ప్రమోదపూర్ణమతియై - యిటు వల్కుచునుండ నశ్రువుల్
చెక్కుల జాలువారుటలు చెల్లి ప్రజావతి సంశయించి - యా
ప్రక్కకు జేరి కన్నుగవ పైట చెరంగున నొత్తి మెల్లగా
నక్కున జేర్చుకొన్నది ప్రియమ్మన సోదరి యుత్తమాంగముఖ్

అది - విభ్రాంతియొ! విహ్వలత్వమొ! యనన్యాసక్తియో! భక్తియో!
హృదయావేగమొ! పారవశ్యమొ! రసోద్రేకమ్మొ! సమ్మోహమో!!
తుది పర్యాయము ముద్దువెట్టుకొని పుత్రుఖ్ - నేత్రముల్ మూసికొ
న్నది మాయామహిళామతల్లి పరమానందమ్ము మిన్నందగన్!

మూసిన లోచనద్వయము మూసిన యట్లనె యుండె - మోవి గై
సేసిన హాసరేఖ గయిసేసిన యట్లనె యుండె - లేదు ని
శ్వాసము రాణికిన్ - హృదయ చాలనముఖ్ గనరాదు - జీవితా
శ్వాసము పూర్తియయ్యె - భగవంతుని దెంతటి రాతిగుండెయో!

కలకలలాడు మేడల మొగమ్ములు నీడల కాలవాలమై
వెలవెలబోయె - శాక్యపురవీధుల ఖేద పయోదమాలికల్
వలగొనె - నాటి రే కపిలవస్తుపురమ్ము స్మశాన వాటిలో
వెలుతురు గాంచి గుండెలు ద్రవించెను కొండలచక్రవర్తికిన్!!!

# స ము న్మే ష ము

"శారద చంద్రబింబ" మన జాలిన బాలుని మోము ప్రేమ నిం
డారగ జూచి రాజు హృదయమ్మున గ్రమ్మిన కాఱు మేఘముల్
దూరములై చనందొడగె - దుఃఖ సుఖమ్ములు శాశ్వతమ్ములై
మారకయున్న మానవుల మానసముల్ భరియింపగల్గునే?

ఘన మగు గాలివానకు బ్రకంపితమై ధృతి దూలి వంగి క్రుం
గిన వటవృక్ష మెట్టులో చిగిర్చి సముత్థితమై యథాస్థితిన్
గనెడి విధమునన్ - ధరణికాంతుడు ప్రాణసతీ వియోగ సం
జనిత విషాదమున్ మరచి స్వస్థతగాంచె క్రమక్రమమ్ముగన్

సర్వార్థమ్ములు వీని కారణమునన్ సంసిద్ధ మౌనంచు నం
తర్వాణుల్ వలుకంగ చిత్త మిగురొత్తన్ సర్వ సర్వంసహా
సర్వస్వమ్మగు నాత్మ నందనునకున్ 'సర్వార్థసిద్ధుం' డటం
చుర్వీశానుడు పేరువెట్టె ప్రజ లెంతో సంతసమ్మందగన్

అనుగుంబిడ్డకు కన్నతల్లి యనురాగాంకమ్ము లేదన్న లో
టు నివారించెను పిన్నతల్లి - తలిదండ్రుల్ కూర్మి పాలింపగా -
జననాథాత్మజు డొప్పె నెల్లరు తనున్ "సర్వార్థసిద్ధుం" డటం
చును "సిద్ధార్థు" డటంచు "శ్రీఘను" డటంచున్ పేర్మి లాలింపగన్!

పండెను యాచక ప్రతతి భాగ్యఫలమ్ములు - కర్షకాళికిన్
నిండెను బండ్లు పాతరలు - నిత్యము బానలనిండ దుగ్ధముల్
పిండెను గోగణమ్ము - నిజుపేదకు లే దను పల్కె-కండె లే
కుండెను - శాక్యరాట్ తనయు డూయలలో చిరునవ్వులొల్కగన్!

అలరెన్ దిక్కులు దివ్య దీధితులతో - ఆనంద సంధాత్రియై
వెలసెన్ ధాత్రి సమస్తసస్యములతో - వెల్గొందె సూర్యేందు మం
డలముల్ కన్నులవిందుగా - పసరుతోటల్ మూడుపూ లారు కా
యలుగా వర్ధిలె - వర్ధమాను డగు సిద్ధార్థుండు దోగాడగన్!

అలకలు దువ్వుచున్ జలకమార్చుచు చక్కదనాలమోముపై
తిలకము దిద్ది కజ్జలము దీర్చుచు ముద్దులపూజసేయుచున్ -
పులకితగాత్రయై యనుగుపుత్రు ప్రజావతి పెంచుచుండె క
న్నుల నొలికింపుచున్ చిర మనోరథ మౌక్తిక మాలికావళుల్!!

# సమున్మేషము

"చిదిమిన పాలుగారు నును జెక్కు లవే! చిగురాకు చిట్టి లే
బెదవుల ముద్దు మూతి మురిపింపు లవే!" యవి అక్క కళ్ళలో
మెదల సవిత్రి పుత్రు ననిమేషము గన్గొను - నెత్తు - ముద్దిడున్ -
చెదరు మనమ్ముతో వణుకుచేతులతో తడికన్నుదోయితో -

'అమ్మ' యటంచు ముద్దు కొడు కల్లన బల్కుట గాంచి నేత్రముల్
చెమ్మగిలెన్ ప్రజావతికి -, చిన్ని కుమారుడు మెల్లమెల్లగా
గుమ్మము దాటి తప్పటడుగుల్ పడుచున్ పడుచుండ నేవియో
కమ్మని సౌప్తిక ప్రణయ గాధలు బాధలు రేపె తేనికిన్

తల్లి కుమారు నెత్తుకొని దవ్వుల దాగుడుమూతలాడు జా
బిల్లిని జూపి బువ్వ దినిపింపగ "తెల్లని చందమామలో
నల్లని మచ్చ యే"మని మనంబున సందియమంది నందనుం
డొల్లడు భోజనమ్ము; నెదియో మది యోజనసేయబూనుచున్

కేల పదాంబుజంబును లగించి ముఖాంబుజమందు; కౌతుక
శ్రీలు వెలార్చు బాలుని - సుశీలుని - మేలి కదాని తూగు టు
య్యేలల నూపుచున్ జగములే మఱచెన్ జనయిత్రి; ప్రక్కయే
పాలసముద్రమై యనుగు పట్టియె బాల ముకుందమూర్తియై -

కరుణశ్రీ

వేద వీధులందు విహరించు దేవుని
పొత్తులందు నెత్తి బుగ్గగిల్లి
యుగ్గుపాలు వోసి యుయ్యేలలో నుంచి
పాడసాగె జనని ప్రణయగీతి:-

"జోలపాడి నేను జోకొట్టుచుందును
కన్నుమూయు మోయి! కన్నతండ్రి!
నిద్రలోన వచ్చి నిన్నెత్తుకుందురు
స్వర్గసీమలోని చంద్రముఖులు

నన్నుగన్నతండ్రి! నా భాగ్య దేవత!
చిన్నినాన్న! గోల సేయబోకు!
గోలసేతువేని కొంటెవా డందురు
కొంటెవైన మామ కూతు నీడు

ఏది! ఏది!! నాదు హృదయమ్ము పులకింప
నాన్న! ఒక్కమాటు నవ్వవోయి!
కన్ను లార్పకుండ గాంచుచుందును నేను
కదలకుండ నీవు నిదురపొమ్ము!

## సమున్మేషము

ఏడ్వబోకుమయ్య! యిందీవరేక్షణ!
కన్నుదోయి నీరుగ్రమ్మునోయి!
పాలుగారు మోము నీలాలు గారిన
కావి మోవి కందిపోవునేమొ!!

అదిగొ కొండ! కొండ కల్లంత దూరాన
కాన గలదు - కానలోన గలడు
నల్లమోము దొంగ - పిల్ల అల్లరిసేయ
పట్టుకొనును పెద్దబారసాచి

వెండి గిన్నె నిండ వేడి పాయసముతో
పైడి గిన్నె నిండ పాలతోడ
చందమామ రావె! జాబిల్లి! దిగిరా॥
బోసిబాబు నోట పోసిపోవె!

చిట్టి తండ్రి రేపు శ్రీమహావిష్ణువై
ముద్దులొలుకు పసిడి గద్దె నెక్కు;
బాబు మౌళి మీద బంగారు మకుటంబు
కోటి సూర్య కాంతి గ్రుమ్మరించు

కరుణశ్రీ

పెద్దపెద్ద దొరలు భృత్యానుభృత్యులై
చిట్టిబాబు కాళ్లు పట్టగలరు;
చిగురు మోవి మీది చిరునవ్వు వెన్నెలల్
భరతఖండ మెల్ల ప్రాకగలవు

బాల భాను కిరణ జాలమ్ము ప్రసరింప
కరగిపోయె నంధకార మెల్ల
ఆడుకొనగవచ్చి రబ్బాయి లందరు
బాబు! నిద్ర చాలు ప్రక్క దిగుము

కరుణ తెచ్చె నోయి! కనకాంబరమ్ములు -
సరళ తెచ్చె నోయి! జాజిపూలు -
పారిజాతములను పంపించె ననసూయ -
కొండిచుట్ట వేసికొందు లెమ్ము!

ఆరగింపవయ్య! ఆనందవర్ధన!
పాలు పంచదార పనసతొనలు;
పనసతొనలు తినిన బంగారు తండ్రికి
మనసు మాట కూడ మధుర మగును"

# సమున్మేషము

ఆలకించుగాని అరమోడ్పు కనులతో
ప్రభుపు మాతృదేవి ప్రణయ గీతి;
ప్రణయ గీతిలోని పరమార్థ భావమ్ము
చిన్ని పెదవి విప్పి చెప్పలేడు

గజ్జె గట్టు లేడిబుజ్జాయి మెడలోన
"గల్లు గల్లు" మంచు గంతులిడగ;
రామచిలుక పంజరమ్ములో పలికిన
మారుపలుకు చిట్టి నోరు విప్పి

అన్ని పండ్లకంటె ఆసక్తి యధికంబు
బాబునకు రసాల ఫలము లనిన
ఆమ్రపాలి గొంతు అల్లంత విన్నంత
పాలగిన్నె విడిచి పరువులెత్తు

గడప లన్ని గడచి బుడిబుడి నడలతో
పడుచు పడుచు తప్పటడుగు లిడుచు
పొగడ చెట్టు నీడ పగడాల తిన్నెపై
కొలువు దీర్చు బాలకులను గూడి

కరుణశ్రీ

తల్లి పెట్టు తియ్యతాయమ్మ లన్నియు
పంచిపెట్టు బీదబాలకులకు;
కన్నె కల్పలతల విన్నాణములు దిద్దు
చిన్న చిన్న చిగురు చేతు లెత్తి

శ్రీకరమ్ములైన ఆ కరమ్ముల సుధా
శీకరమ్ము లింత చిందినంత
ఇంతలేసి మొక్క లెల్ల నింతింతలై
అంతలేసి యగుచు నతిశయిల్లు

వృద్ధినందె బాల సిద్ధార్థ చంద్రుండు
రోజు రోజు శాక్యరాజు నింట
కపిలవస్తునగర కల్యాణ కలశాబ్ధి
పొంగిపొరలె నుత్తరంగ మగుచు

బాల గౌతముండు పరుగెత్తు నప్పుడు
"గల్లు"మనెడు కాళ్ల గజ్జెలందు
విశ్వమోహనముగ వేదాంతవీథుల
మంత్ర సూక్తు లేవొ మారుమ్రోగు

## సమున్మేషము

మంగళ మందహాస సుకు
మార కపోలము లుల్లసిల్ల సౌ
ధాంగణ భూమి స్వామి నడ
యాడుచు - నాడుచునుండ, నంగనల్
చెంగున వచ్చి - యెత్తుకొని -
చెక్కిలి చక్కిలిగింత వెట్టుచున్
బంగరుతండ్రి - లేబెదవిపై
విరియింతురు పండువెన్నెలల్

"ఇంత నిమేషముల్ నిలువ
వెప్పుడు దేహళి దాటి వచ్చినా
వంటిన కందిపోవు భవ
దంఘ్రితలమ్ముల చూడు మెంత దు
మ్మంటినదో"యటంచు ప్రణ
యాంకమునం దుపవిష్టు చేసి ప
య్యంట చెరంగుతో తుడుచు
నంబ కుమారు పదాంబుజాతముల్

కరుణశ్రీ

'దు'మ్మనుచుఁ బటాంచలము
తో దుడువం దలపెట్టెగాక - ఆ
యమ్మ యెరుంగ దాత్మ తన
యాంఘ్రి సరోజ రజో మహా ప్రభా
వమ్ము రవంత! త ల్లవల
వమ్ములకోసము దేవతా కిరీ
టమ్ములు సార్వభౌమ మకు
టమ్ము లవెన్ని తపించుచుండెనో!

పువ్వుల తోట కాడుకొన
బోవ, నొయారముగా బుజాలపై
'రివ్వన'వచ్చి వ్రాలు తెలి
తెక్కల చిక్కని పావురమ్ములన్
నవ్వుచు చేరదీసి "కరు
ణానిధి" మేతలుపెట్టి చేతితో
దువ్వుచు వింత కౌతుకము
తో విసరున్ వినువీధిలోనికిన్

## సమున్మేషము

అపరిమిత ప్రహర్ష మయ
మై యలరెఁ బ్రజలు ల్లసిల్లగా
నుపనయనోత్సవ మ్మది ము
హుర్ముహు రారచిత ప్రజావతీ
నృప నయనోత్సవ, మ్మెనిమి
దేడుల పచ్చని బ్రహ్మచారి సి
గ్గుపడియె పోగులుం బసుపు
గోచియు పంచశిఖల్ ధరియించుచుఁ

"భిక్షాందేహి" యటంచు పుత్రుడు
సమీపించఁ బ్రమోదాశ్రువుల్
వక్షోజమ్ముల జార తల్లి కరుణా
వాత్సల్య సంపూర్ణయై
భిక్షంబెట్టె - నెరుంగ "దీతడు
జగత్ ప్రేమైక దీక్షా మహా
భిక్షూత్తంస" మటంచు భావిగతి
భావింపంగరా దేరికిఁ!

కరుణశ్రీ

శుద్ధాంతఃకరణమ్ము నన్ జనకుడౌ
శుద్ధోదనుం డంపగా
శ్రద్ధాభక్తులతో మహామహుని
'విశ్వామిత్రు' సేవింపుచున్
సిద్ధార్థుండు కళాప్రపూర్ణు డయి
భాసించెన్ యథాకాల సం
బుద్ధ ప్రాక్తన భాగ్య యోగ
లహరీ పూరం బపారంబుగన్

"అక్షరదీక్ష" గైకొని, "పదార్థ
విదుం"డయి, "వాక్యకల్పనా"
దక్షతనంది, "రీతిగుణ
ధర్మవిభేద" మెరింగి, "వ్యంజనా
లక్షణ"లంగ్రహించి, సమ
లంకృతులన్ కృతులన్ పఠించి, శా
క్య క్షితిపాల నందనుడు
గాంచెను విశ్వ కళా రహస్యముల్—

ధనురాకర్షణ బాణవర్షణ
కళా దక్షుఁ, గదా ఖడ్గ చా
లన పారీణుని, మల్లయుద్ధ
విజయోల్లాసుఁ, గృతాభ్యాసు, స్యం
దన మాతంగ తురంగ ధావన
రహస్తత్త్వజ్ఞు, వీరాధి వీ
రుని, సిద్ధార్థకుమారునిఁ
గని నరేంద్రుం డొప్పె సానందుడై

అంకురమై - రసోల్లసితమై -
ొనసాగి - నవ ప్రవాళ రే
ాంక దళాంచలోచ్ఛలితమై -
రనాథు నదృష్టవల్లి స
వ్వంకల బ్రాకి సౌరభములఁ
రజిమ్ముచు పుష్పమండలా
ంకృతులన్ మనోరథ
లప్రద మయ్యె గ్రమక్రమమ్ముగఁ

# సానుభూతి

శ్రుతుల తత్వార్థ సంహిత లెల్ల పఠియించి
స్మృతుల నానార్థ సంగతులు చదివి
నిఖిలశాస్త్రాల పాండిత్యమ్ము గడియించి
యఖిలాస్త్ర జాల రహస్య మెరిగి
తంత్రవాదముల యంతస్సార మూహించి
మంత్రవాదమ్ముల మర్మ మరసి
రమణీయ కావ్య సారస్య మాస్వాదించి
కమనీయ సాహితీ క్రమము లెరిగి
వ్యష్టిలోన సమష్టి భావమ్ము నించి
సృష్టినెల్ల విశిష్ట దృష్టికి లగించి
విబుధవరులైన గురుల సేవించి, మంచి
ప్రజ్ఞ గని మాయకొడుకు సర్వజ్ఞు డయ్యె

## సానుభూతి

ఉదయలక్ష్మి నవాభ్యుదయ భంగిమలోని
యనురాగ సరసిలో మునిగిపోయి -
నీలమేఘాల కన్నీటి చుక్కలలోని
కరుణారసమ్ములో కరగిపోయి -
లలిత లతా మతల్లుల జీవితములోని
కమ్మ నెత్తావిలో గలిసిపోయి -
నేల రాలిన పూలబాల గుండెలలోని
జాలి నిట్టూర్పులో తేలిపోయి -
ప్రేమమూర్తి సందర్శనాపేక్షతోడ
ప్రకృతిసౌందర్య భావ సోపాన పంక్తి
కేళికాలోల లీలా మరాళ గతుల
బాల సిద్ధార్థ హృదయమ్ము పరువులెత్తు

ఒకవేళ చిరునవ్వు లొలకబోసెడి చిట్టి
పాపల మొగ మదే పనిగ జూచు
ఒకసారి మండుటెండకు మాడు కర్షక
వ్రాతమ్మునకు సానుభూతి తెలుపు

ఒకతేప తోడి బాలకుల నొక్కెడ చేర్చి
తీయని నుడుల సందేశ మొసగు
ఒకమాటు రోహిణీ సికతాతలమ్ముపై
గూర్చుండి కన్నీరు గార్చుచుండు
ఒక్కపరి మేడమీద నిల్చుండి విపుల
కపిలవస్తుపుర మ్మెల్ల కలియజూచు
అపరిచిత విశ్వవీణలో ఆత్మగీతి
మేళన మొనర్చు శాక్యభూపాలసూతి

గగనాంగణమున బంగారు గీతలు గీయు
శంపాలతాంగి చాంచల్య మెంచి
బాలభానువి పైడి పాదాలు ముద్దాడు
పద్మినీదేవి సంబరము చూచి
చిగురాకు సెజ్జపై చిరునవ్వు చిందించు
హిమబిందువుల యమాయికత నరసి
నెలతకు వెండి వెన్నెల తీగ లందించు
ప్రియ చకోరస్వామి ప్రేమ గాంచి

## సానుభూతి

ఏడురంగుల మకుటంబు నెత్తుకొన్న
ఘన ఘనాఘనమూర్తి జీవనము దలచి
"యుస్సు"రని యొక్క వేడినిట్టూర్పు వుచ్చి
క్రిందుమీదౌను శాక్యరాణ్ణందనుండు

నీలాభ్రమాలలోనికి జొచ్చుకొనిపోవు
నగచక్రవర్తి యౌన్నత్యమునకు -
కడుపులో బడబాగ్ని నిడి కాలుకదపని
ప్రేమాంబురాశి గాంభీర్యమునకు -
కరగి నీరై లోకకంఠమ్ము పూరించు
ధారాధరేంద్రు సౌందర్యమునకు -
అంధసృష్టికి దృష్టి నందించి మేల్కొల్పు
లోకబాంధవు దయాళుత్వమునకు -
చలువ దోసిళ్ల పాల వెన్నెలలు చిలికి
యోషధుల పెంచు శశి నిశాశ్లేషమునకు -
హృదయమున నేవియో యూహ లుదయమంద
ముందడుగువేయు శ్రీఘనానందమూర్తి

అందరి మిత్రులం దెవరి
యశ్వము ముందర పోవునో కనుం
గొంద మటంచు పందె మిడి
గుఱ్ఱములం దుమికించు వేళలన్
కొందలమంది నోట నురుగుల్
వెలిగ్రక్కుచు ఘర్మ బిందువుల్
చిందెడి మేనుతో పరుగు
లెత్తుచునున్న నిజాశ్వరాజమున్—

కనుగొని "రాజ నందనుడు"
కారుణికత్వము పొంగి; బాష్పముల్
కనుగొనలన్ స్రవింప తురగమ్మును
నిల్పి, నిజోత్తరీయ చా
లనమున చల్లగా సముప
లాలన సేయుచు పాణిపల్లవ
మ్మున మెలమెల్లగా చరణముల్
స్పృశియించి శ్రమమ్ము వాపుచున్—

# సానుభూతి

"ఎంత కష్టపడితివే అశ్వరాజమా!
బాధనీది; విజయఫలము నాది;
స్వార్థపరుండనగుచు శ్రమపెట్టితిని నిన్ను
పందెమందు గెలుపు నందుకొరకు"

ప్రియహయమ్ము నిట్లు ప్రేమార్ద్రదృష్టితో
బుజ్జగించి పందె ముజ్జగించి
మందిరమ్ము సేరె మనుజేంద్రసూనుండు
జనకు మానసమ్ము సంభ్రమింప

తోడి నృపాల బాలకుల
తో హిమవద్ గహనాంతరాల వే
టాడగబోయి "శాక్యతన
యాగ్రణి"—ముందుకు పారిపోవ కా
లాడక త్రాస చంచల దృ
గంచల మై తలద్రిప్పిచూచు నా
లేడినెలంతపై విసర
లేడు విశాత శిలీముఖమ్ములన్

## కరుణశ్రీ

అగతిహీన దీన హరి
ణాంగన చూచిన జాలిచూపులో
దాగుడుమూతలాడు "కరు
ణామయి" గౌతము లేతగుండెకున్
స్వాగతమిచ్చి విన్నపము
సల్పెను విశ్వ విషాదగాధ బా
ధాగత గద్గదత్వము క
తమ్మన మ్రోగని మూగగొంతుతో

అ మ్మృగమూర్తిలో భువన
మంతయు చల్లని ప్రేమమూర్తియై
చిమ్మె సుధాప్రవాహము వి
శేషముగా "అమితాభు" మానసా
బ్జమ్మున—అంత రాసుతుడు
వారువమున్ మరలించి చేతి వి
ల్లమ్ములు పారవైచి నిల
యమ్మునకున్ జనె సానుభూతితో

## సానుభూతి

"తలవంచు" మండుటెండలలోన మాడుచు
పొలముదున్నెడి కృషీవలుల గాంచి
"నిట్టూర్పుపుచ్చు" జానెడు గుడ్డతో కూటి
కై పాటుపడు బీదరాలిగాంచి
"కన్నీరునించు" చక్కని పూలకన్నెల
గొంతులు నులుము భక్తులనుగాంచి
"కరగి నీరౌ" వ్రేళ్ళు కాయలుగాయ క
ష్టెలు కొట్టుకొను కార్మికులను గాంచి
"సానుభూతివహించు" గ్రీష్మమ్మునందు
నెండి కార్శ్యమ్ముగను సెలయేళ్ల గాంచి
విశ్వకారుణ్యభావ సంవేద్యమాన
మానసుండయి శాక్యభూజానిసుతుడు

# అ ను కం ప

అంత సౌవర్ణకాంతి సంక్రాంత మొక ని
శాంతమున శాంత హిమగిరి ప్రాంతములకు
ఈడుజోడు నెచ్చెలికాండ్ర తోడగూడి
బాల సిద్ధార్థమూర్తి వాహ్యాళి వెడలె

చెలికాండ్రందరు వెంబడింప
నుదయశ్రీ శ్రీముఖమ్మందు ము
ద్దుల కాశ్మీరము దిద్దితీర్చ
భగవంతుఁ సూర్యనారాయణుఁ
జలజాప్తుఁ కులదైవముం గనుచు
ప్రస్థానించె మార్గమ్మునఁ
లలితాకారుడు రాకుమారుడు
తనూలావణ్యవిస్తారుడై

## అనుకంప

కొదమ గిత్తల తోలుకొనిపోవుచున్నాడు
సేద్యకాడా మూల చేనుదున్న
గుగ్గిళ్ళకై కోసికొనుచుండి రావైపు
కాపు కన్నెలు క్రొత్తకందికాయ
గొల్లబొట్టెలు మేపుకొనుచున్నవారదే
ఆలమందల శాద్వలాలయందు
అల్లదే! ఎదురుగా నరుదెంచుచున్నాడు
పాలకావడితోడ పాలికాపు
కంటిరే రోహిణీనదీ గర్భమందు
ప్రతిఫలించెను పద్మినీబాంధవుండు;
జనని యనురాగ పూర్ణవక్షమ్మునందు
పసిడినిగ్గుల పాల పాపాయి వోలె

రాగమయమైన ప్రకృతి సామ్రాజ్యమందు
ప్రతిపదంబును రసవైభవమ్ము విలుచు;
రసమయంబైన సుకవిసామ్రాజ్యమందు
ప్రతిపదంబున రాగసంపదలు నిలుచు

ఇటుల ప్రాభాత శోభా సమీక్షణమున
స్వాంతనళినమ్ము లనురాగ సరసి దేల
స్నేహితులగూడి విహరించె శ్రీఘనుండు
సృష్టి సౌందర్యమును బ్రశంసించుకొనుచు

ఒకచెట్టునుండి యింకొక చెట్టునకు "చెంగు
చెంగున" దుముకు ప్లవంగములును
ఒక కొమ్మనుండి యింకొక కొమ్మపై "కల్ల
నల్లన" నెగురు విహంగములును
ఒకపూవునుండి యింకొక పూవుమీదికి
"రింగురింగున" నేగు భృంగములును
ఒక పుట్టనుండి యింకొక పుట్టలోనికి
"జరజర" ప్రాకు భుజంగములును
ఒక్కపొదనుండి యింకొక ప్రక్కపొదకు
చెంగలించెడి బాల కురంగములును
కలిగి కన్నుల పండువౌ కాననంబు
కాంచి పులకించె శాక్య భూకాంతసుతుడు

## అనుకంప

వచ్చుచునున్న బాల భగ
వానుని చేతులుసోకి అప్పుడే
విచ్చుచు విచ్చుచుండె అర
విందకులంబు కొలంకులందు ; గో
ర్వెచ్చని తియ్యదేనియల
విందులు సిద్ధమొనర్చి స్వాగతం
బిచ్చుచునుండె సుందర వ
నేందిర తుమ్మెద పువ్వుబోండ్లకున్

మంజుల పింఛముల్ గగన
మండలమందు పదేపదే తటిత్
పుంజములన్ రచింప ఫణి
భుక్కులు చక్కగ సల్పెనాట్యముల్ ;
కుంజకుమారికల్ సరస
కోమల హస్తములెత్తి భక్తి పు
ష్పాంజలులన్ వెలార్చినవి
స్వామికి ప్రేమపరీమళమ్ముతో

కరుణశ్రీ

మిల మిలలాడు మంచు మల
మీది నవారుణరేఖ గాంచుచున్ -
కలకల కూయుచున్న విహ
గమ్ముల గీతిక లాలకించుచున్ -
జలజల పారు నిర్ఝరుల
చల్లని జల్లుల మున్గితేలుచున్
కిలకిల నవ్వు పువ్వు లొలి
కించు మరందము లాహరించుచున్

మోదముమీర కేల శర
ముల్ ధనువుల్ ధరియించి దేవద
త్తాది సుహృద్గణమ్ము మృగ -
యారతులై తిరుగాడుచుండ నా
హ్లాదముతోడ శాక్య తన
యాగ్రణి మంజుల మాలతీ లతా
చ్ఛాదిత రాగరంజిత కి
సాల రసాల తరూపవేదికన్

## అనుకంప

ఒక్క సెలయేటిచెంత గూర్చుండి, ఎదుట
ప్రతిఫలించు వినీలాంబరమ్ము నుదుట
జీవనపథాల పరువెత్తు యౌవనంపు
వంపులం గాంచుచుండె భూవరసుతుండు !

అంబరవీథియందు గన
నయ్యెను బారులు బారులై విహం
రంబొనరించు మంజుల మ
రాళ గళమ్ము — మహా కవీంద్రు భా
వాంబరవీధి విశ్రుత వి
హార మొనర్చు రసార్ద్రభావనా
లంబి సరస్వతీ చరణ
లాస్య విలాసము లుల్లసిల్లగన్

గగనమున నేగు కలహంస గణముగాంచి
జాగరితమయ్యె నేమొ హింసాప్రవృత్తి !
నారి సారించి వాడి బాణమ్ము నొకటి
దేవదత్తుండు వింట సంధించి విడచె

కరుణశ్రీ

ఆకసమునందు తెక్కలల్లార్చుకొనుచు
దండులో దూరి పోవుచునుండెగాని
మృత్యుదేవత గుఱి తనమీదపడుట
యెరుగలేదయ్యొ నా అమాయికపు హంస

క్రూర కఠోరబాణమున
కుఁ గుఱియై కలహంసరాజు క్రేం
కారము సేయుచుఁ బడె "న
ఖండదయానిధి" పాదసన్నిధిఁ
ఘోర మునీంద్ర శాపమున
కుఁ బలియై గగనాంతరాళ సం
చారముదక్కి వారినిధి
జారు శశాంకుని జ్ఞప్తికెత్తుచుఁ

"గిరగిర" దిరుగుచు, నరచుచు
ధరణీస్థలి గూలి, సోలి, తడబడు హంసన్
కరుణాంభోధి కనుంగొని
బిరబిరజని యెత్తిచేర్చె ప్రేమాంకమునన్

## అనుకంప

క్రొత్త యనంటి మొవ్వవలె
కోమలమౌ కలహంస డొక్కలో
నెత్తురు ధారకుఁ గనుల
నింపుచు వెచ్చని బాష్పధార, "లో
కోత్తరమూర్తి" యెట్టు లెటు
లో శరముఁ వెడలించి, గాయముఁ
మెత్తని వ్రేళ్ళతోడ మెల
మెల్లగ నొత్తుచు, బాధ మాన్పుచుఁ

ఱెక్కలు దువ్వి, వీపు సవ
రించి, పదమ్ముల కుంటుదీర్చి, లే
జెక్కిలి చక్కదిద్ది, సరి
చేసి తనూలత, ప్రేమపూర్ణమౌ
వాక్కులు పల్కుచుఁ, దిగులు
వాపుచు, ముద్దుల బుజ్జగించుచుఁ
మక్కువమీర గౌతమ కు
మారుడు లాలన సేయుచుండగఁ

విల్లు నెక్కుడించి వీరత్వమునమించి
దేవదత్తు డేగుదెంచి పలికె
హంస నెత్తుకొనెడి యనురాగమూర్తితో
రోషపూర్ణ పరుష భాషణముల

"రాజకుమార ! ఈ విహగ
రాజము నాయది ; అస్మదీయ బా
హా జయలక్ష్మికిఁ సముప
హారము ; నాకు లభించుగాక నీ
రోజు మనోజ్ఞ మానస స
రోవర హైమ మృణాల వల్లరీ
భోజన రాజభోగ పరి
పుష్ట మరాళ శరీర మాంసముల్

ఆకసమునందు గుంపులో నరుగుచుండ
వాడి శరమేసి కూల్చినవాడనేను ;
కొట్టిన విహంగమును దాచుకొందువేమి ?
పక్షినీవయ్య ! శాక్యభూపాలపుత్ర !"

## అనుకంప

వేటకాని గ్రుడ్లు వీక్షించి గడగడ
వడకి, అంకపాళి ముడుచుకొనెడి
పక్షి భయము వాపి పలికె "దయామయ
చిత్తు" డట్లు దేవదత్తుజూచి

"పాలు గారెడి రాయంచ ప్రక్కలోన
క్రూర నారాచ మేరీతి గ్రుచ్చినావు?
నిండు జాబిల్లి మెత్తని గుండెలోన
కుటిల విషదంష్ట్రి రాహువు గ్రుచ్చినట్లు

అలుగు వింట దొడిగి యాకాశమున నేగు
పులుగు నేల గూల్పగలిగినావు:
మనసులోన నెగురు మాత్సర్య ఖగమును
గొట్ట వింటి నెక్కువెట్టలేవు!

హింసలు గావించుటకై
హంసలె గావలసి వచ్చెనా! క్షత్రకులో
త్తంసులకు, సమద శత్రు
ధ్వంసన మొనరింపరాదొ దర్పము కలిమిన్

కరుణశ్రీ

ఎక్కడనో జనించి, పర
మేశ్వరు డిచ్చిన గాలి పీల్చి, వే
రొక్కరి జోలి కేగక, యె
దో భుజియించి, సరోవరాలలో
గ్రుక్కెడు నీళ్ల గ్రోలి, విను
త్రోవల నేగెడు రాజహంసపై
రక్కసి బుద్ధి సెల్లునె ? మ
రాళ మరాళ శరాగ్ను లోర్చునే ?

రాచకొలమ్ము వారలకు
రక్షణ సేయుట సెల్లుగాని, నా
రాచము లూని ప్రాణి నిక
రమ్ముల స్వేచ్ఛ హరింప చెల్లునే ?
ఈ చతురబ్ధి వేష్టిత మ
హీ వలయమ్ము లయమ్ముగాదె హిం
సా చరణమ్మునన్, తగునె
క్షాత్ర పదమ్మును పాడు సేయుటల్"

# అనుకంప

"నాది నాది" యంచు "కాదు కా"దంచును
హంసకొరకు వాదులాడి యిట్లు
చనిరి దేవదత్త సర్వార్థ సిద్ధులు
రాజసభకు విహగరాజు తోడ

పోయి యచటనున్న న్యాయాధికారితో
నంచ తగవు విన్నవించుకొనిరి;
ఉభయపక్షవాద ముత్సాహమున విని
తగవుసెప్పె నిట్లు ధర్మమూర్తి

"ధరణి సమస్త భంగుల ప్ర
ధానము ప్రాణము ప్రాణికోటి—కే
కరణి లభించునయ్య! యధి
కారము ప్రాణులపైని ప్రాణ సం
హరణ మొనర్చునట్టి కఠి
నాత్ములకున్? క్షతిగన్న పక్షికిన్
శరణ మొసంగి రక్షణము
సల్పిన క్షాత్ర వతంసు లుండగన్

బాణహతి చేత ప్రాణమ్ము వాసెనేని
దేవదత్త కుమారునిదే ఖగమ్ము;
ప్రాణదానమ్ము సలిపి కాపాడు కతన
రాజపుత్రునిదయ్యె నీ రాజహంస"

అనుచు తీరుపు దీర్చి న్యాయాధికారి
హంస నొసగె కుమార వతంసమునకు;
జయజయ నినాదములు సభాసదులు వలుక
శాక్యపతి కండ్ల హర్ష బాష్పమ్ము లొలుక

ఆ కరుణాసముద్రుడు వి
హంగమమున్ మరికొన్నినాళ్ల ప్రే
మైక విలోకనమ్ముల ప్రి
యంబిడి పాలన సేసి, స్వాస్థ్యముం
గైకొన నిల్లుచేరగ, నొ
కానొక చల్లని సంజవేళలో
నాకసమందు పో విడచె—
నయ్యదియుం జనె రెక్కలార్చుచున్—

# కరుణశ్రీ

## ప్రథమ భాగము

సుఖస్వప్నము
శుభోదయము
నిశ్వాసము
సమున్మేషము
సానుభూతి
అనుకంప

# కరుణశ్రీ

## ప్రథమ భాగము

సుఖస్వప్నము
శుభోదయము
నిశ్వాసము
సమున్మేషము
సానుభూతి
అనుకంప